| | | |
|---|---|---|
| జటాధరి | .... | సగరిమపధనిస-సనిధపగరిస |
| లోకరంజని | .... | సగమపమధనిస-సనిధనిపమగరిస. |
| తపస్విని | .... | సగమపనిస-సనిధపమగస. |
| శ్రీకరి | .... | సరిగపధనిస-సనిధపమగస. |
| మేఘమల్లారు | .... | సగమపధనిస-సనిధపమగమరిస. |
| యోగానంది | .... | సరిగపమపధనిస- సనిధపమగస. |
| ప్రతాపము | .... | సపమపధనిస-సనిధపమగరిస. |
| మందహాసిని | .... | సరిగమపమధనిస-సనిధపమగమరీస. |
| హంసగమని | .... | సగమపనిధస-సనిధపమధపమగరిస. |
| కలాభరణి | .... | సగరిగమపనిధని-ధపమగరిసనిస. |
| మేఘశ్యామల | .... | సగమపధనిధపస-సధనిపమగరీస. |
| రసవినోదిని | .... | సగమపథనిథస-సనిథపమగస. |
| వేదస్వరూపి | .... | సరిగమపథనిపస-సనిథనిపమగస. |

### 53. గమనశ్రమ-శురి-అంగ-ప్రమ-ప-చధ-కాని.

| | | |
|---|---|---|
| గమకప్రియ | .... | సరిగమపథస-సనిధపమగమరిస. |
| శుద్ధరసాళి | .... | సగమపథస-సథపమగరిస. |
| సుఖధ్వని | .... | సగమపనిథస-సథనిపమగరిస. |







| | | |
|---|---|---|
| కన్నడమారువ | .... | సగమపథనిస-సనిథపమగస. |
| పూర్వకళ్యాణి | .... | సరిగమపథనిథస-సనిథపమగరిస. |
| మేచకాంగి | .... | సరిగమపథపనిస-సనిపథపమగరిస. |
| గగనసరసీరుహము | .... | సగరిగమపథని-థపమగరిసనిస. |
| హంసానంది | .... | సరిగమథనిస-సనిథమగరిస. |

### 54. విశ్వంభరి-శురి-అంగ-ప్రమ-ప-షధ-కాని.

| | | |
|---|---|---|
| విజయవసంతము | .... | సమపథనిస-సనిపమగస. |
| వైశాఖము | .... | సరిగమపథనిస-సనిథనిపమగమరిస. |
| దేశ్యమారువ | .... | సరిగమనిస-సనిపమగరిస. |
| వూషాకళ్యాణి | .... | సరిగమపథనిస-సనిపమగరిస. |
| నాగసరసీరుహము | .... | సగమపస-సనిథనిపమరిస. |
| భ్రమరధ్వని | .... | సగమథనిస-సథనిపమగరిస. |
| సింధుమారువ | .... | సరిగమపస-సనిథనిపమగరిస. |

### 55. శ్యామలాంగి-చరి-సాగ-ప్రమ-ప-శుధ-శుని.

| | | |
|---|---|---|
| శ్యామల | .... | సగరిగమపథనిథస-సనిథపమగరిస. |
| శీతకిరణి | .... | సరిగమపథనిస-సథనిథపమగస. |

| | | |
|---|---|---|
| కమలనారాయణి | .... | సరిమపధనిస-సనిధపమగమరిస. |
| నాగప్రభావళి | .... | సగమపధనిస-సనిధమగరిస. |
| దేశావళి | .... | సరిగమధనిధస-సనిధమగరిస. |
| హంసగీర్వాణి | .... | సరిగమపధస-సధపమగస |
| దేశ్యనాటకురంజి | .... | సరిగమపధపనిస-సనిపధపమగరిస. |
| నాగగీర్వాణి | .... | సరిగమధనిధస-సనిధపమగరిస. |

### 56. షణ్ముఖప్రియ-చరి-సాగరి-ప్రమ-ప-శుధ-కైని.

| | | |
|---|---|---|
| కుసుమసారంగ | .... | సరిమపధనిస-సనిధపమగరిస. |
| భ్రమరసారంగ | .... | సరిగమపమధనిస-సధపమగరిస. |
| భాషిణి | .... | సగరిగమపనిధస-సనిధపమగరిస. |
| వసుకరి | .... | సగమపధనిస-సనిధమగస. |
| సారంగభ్రమరి | .... | సమపధనిధస-సనిధపమగస. |
| త్రిమూర్తి | .... | సరిగమధనిస-సనిధమగరిస. |
| భ్రమరకుసుమము | .... | సగమపనిస-సనిధపమగరిస. |
| కోకిలానంది | .... | సగమధనిస-సనిధపమగస. |
| దేవమాళవి | .... | సరిగమపధని-నిధపమగరిసని. |







### 57. సింహేంద్రమధ్యమ- చరి-సాగ-ప్రమ-ప-శుధ-కాని.

| | | |
|---|---|---|
| సీమంతిని | .... | సరిగమపధనిస-సపమగరిస. |
| మాధవమనోహరి | .... | సగరిగమపనిధనిస-సనిధమగరిస. |
| పద్మముఖి | .... | సరిగమధనిస-సధపమగస. |
| విజయసరస్వతి | .... | సగమపధనిస-సనిపమగరిస. |
| భ్రమరహంసి | .... | సరిగమపనిస-సనిధపమగస. |
| శుద్ధరాగము | .... | సరిగమపనిస-సనిపమగరిస. |
| భ్రమరసుఖి | .... | సరిగమపధనిస-సధపమగరిస. |
| ధవళహంసి | .... | సరిమపధస-సనిధపమగరిస. |
| భ్రమరకోకిలము | .... | సరిమపనిధనిస-సనిధపమరిస. |
| శేషనాదము | .... | సరిగమపధస-సనిధపమగరిస. |
| ఘంట్టాణము | .... | సరిగమధనిస-సనిధమగరిస. |
| సర్వాంగి | .... | సరిమధనిస-సనిధమగసరిస. |
| సునాదప్రియ | .... | సరిగమపస-సనిధపమగరిస. |

### 58. హేమవతి-శురి-సాగ-ప్రమ-ప-చధ-కైని.

| | | |
|---|---|---|
| సింహారవము | .... | సరిమపనిస-సనిపమరిగరిస. |
| నలినభ్రమరి | .... | సరిమపధనిస-సనిధనిపమరిస. |

| | | |
|---|---|---|
| విజయసారంగ | .... | సరిగమపనిస-సనిధపమగస. |
| భ్రమరవుత్తరి | .... | సరిగమపధనిస-సధపమరిస. |
| కనకభూషావళి | .... | సగమపధనిస-సనిపమగరిస. |
| హంసభ్రమరి | .... | సరిగమపధస-సనిధపమగరిస. |
| హేమాంబరి | .... | సరిగమపధనిస-సపమగరిస. |
| విజయసామంతము | .... | సగమపధస-సనిధమగరిస. |

### 59. ధర్మవతి- చరి-సాగ-ప్రమ-ప-చధ-కాని.

| | | |
|---|---|---|
| ధౌమ్యరాగము | .... | సరిగమపధస-సనిధపమగరిస. |
| విజయనాగరి | .... | సరిగమపధస-సధపమగరిస. |
| రంజని | .... | సరిగమధస-సనిధమగసరిస. |
| లలితసింహారము | .... | సరిగమపస-సనిపమగరిస. |
| శుద్ధనవనీతము | .... | సరిగమధనిస-సనిపమగరిస. |
| విజయశ్రీకంఠి | .... | సగమపస-సనిధమగరిస. |
| వసంతగీర్వాణి | .... | సరిగమపనిధస-సధనిపమగరిస. |
| ధీరకుంతలి | .... | సమపధనిస-సనిధపమగరిస. |

### 60. నీతిమతి- చరి-సాగ-ప్రమ-ప-షధ-కాని.

| | | |
|---|---|---|
| నూతన చంద్రిక | .... | సరిగమపధనిస-సనిపధనిపమగస. |
| విజయరత్నాకరి | .... | సరిమపధనిస-సనిపమగస. |







| | | |
|---|---|---|
| హంసనాదము | .... | సరిమపధనిస-సనిధనిపమరిస. |
| దేవకుసుమావళి | .... | సమగమపస-సనిపమగరిస. |
| కైకవశి | .... | సరిగమపధనిస-సనిపమగరిస. |
| కనకశ్రీకంఠి | .... | సరిగమపస-సనిధనిపమరిస. |
| కుంతలరంజని | .... | సమగమపధనిస-సనిపధనిపమగస. |
| గౌరీక్రియ | .... | సగమపధనిస-సనిధనిపమగస. |
| శుద్ధగౌరీక్రియ | .... | సగమపనిధనిస-సనిధపమగస. |

### 61. కాంతామణి- చరి-అంగి-ప్రమ-ప-శుధ-శుని.

| | | |
|---|---|---|
| కుంతలరాగము | .... | సరిగమపధనిధస-సనిధపమగమరిస. |
| రామకుసుమావళి | .... | సగమపనిధపనిస-సనిధపమగరిస. |
| కర్ణాటకతరంగిణి | .... | సరిగమపనిస- సపమగరిస |
| విజయదీపిక | .... | సరిగమపనిధస-సధనిపమగరిస. |
| శ్రుతిరంజని | .... | సరిగమపధని-నిధపమగరిస. |
| కనకకుసుమావళి | .... | సరిగమపధస-సధపమగరిస. |
| కీర్తివిజయము | .... | సరిగమపనిధస-సనిధపమగరిస. |
| శుద్ధజోతిష్మతి | .... | సగమపస-సనిధపమగరిస. |
| కనకసింహారము | .... | సగమపనిస-సనిధపమరిస. |

## 62. రిషభప్రియ-చరి-అంగ-ప్రమ-ప-శుధ-కైని.

| | | |
|---|---|---|
| రుచిరమణి | .... | సగమపధనిధస-సధపమగరిస. |
| సోమమంజరి | .... | సరిమపధనిధస-సనిపమరిగరిస. |
| పద్మకాంతి | .... | సరిగమపధనిస-సనిపమగరిస. |
| బృందావనదేశాక్షి | .... | సరిగమపమధస-సధపమగరిస. |
| కనక నాసామణి | .... | సరిగమపధనిస-సనిధపమగరిస. |
| శుద్దసారంగ | .... | సగమపనిస-సధపమగరిస. |
| విజయగోత్రారి | .... | సరిగమపధనిస-సనిధపమగరిస. |
| రత్నభాను | .... | సరిమగరిమపనిధనిస-సనిధపమగరిస. |

## 63. లతాంగి- చరి-అంగ-ప్రమ-ప-శుధ-కాని.

| | | |
|---|---|---|
| నవరత్నభూషణి | .... | సరిగమపధస-సనిధపమగరిస. |
| కరుణాకరి | .... | సమపధనిధస-సనిధపమస. |
| గోత్రారి | .... | సరిమపధస-సనిధపమగరిస. |
| స్వర్ణకాంతి | .... | సగపమధనిస-సనిపమగస. |
| సుజనరంజని | .... | సగరిమపధనిస-సనిధపమరిస. |
| సజ్జనానంది | .... | సరిగమపధనిస-సనిధపమగరిస. |
| రత్నకాంతి | .... | సరిగమపనిస-సనిపమగరిస. |







| | | |
|---|---|---|
| ఝణాకారి | .... | సరిగమపనిధస-సధపమరిగరిస. |
| లీలావినోదిని | .... | సరిగమపధనిధస-సనిధపమగరిస. |
| ధాతుప్రియ | .... | సరిపమపధస-సనిధపమగమరిస. |
| చాముండిరాగము | .... | సగరిమపనిధస-సధనిపమగరిస. |

## 64. వాచస్పతి-చరి-అంగ-ప్రమ-ప-చధ-కైని.

| | | |
|---|---|---|
| దేవామృతవాహిని | .... | సగమపనిధనిస-సనిధనిపమగరిస. |
| విజయాభరణి | .... | సరిగమపధనిధస-సనిధపమగరిస. |
| గురుప్రియ | .... | సరిగమధనిస-సనిధమగరిస. |
| సింహస్వరూపి | .... | సగమధనిస-సనిపమగస. |
| సరస్వతి | .... | సరిమపధస-సనిధపమరిస. |
| కేతకప్రియ | .... | సగమపనిస-సనిధపమగరిస. |
| బర్బర | .... | సగమరిగమధనిస-సనిధమగరిస. |
| రత్నాంబరి | .... | సగమపస-సనిధపమరిస. |
| ఉత్తరి | .... | సగమపధనిస-సనిధమగస. |
| పరిమళానంది | .... | సరిగపమధనిస-సనిపమగస. |
| భోగీశ్వరి | .... | సరిగపధనిధస-సనిధపమగరిస. |
| గగనమోహిని | .... | సగపధనిస-సనిపమగస. |

| | | |
|---|---|---|
| భూషావళి | .... | సరిగమపధస-సనిధపమగరిస. |
| తరుణీప్రియ | .... | సగరిగమపనిధస-సనిపమరిస. |

### 65. మేచకళ్యాణి- చరి-అంగ- ప్రమ-ప-చధ-కాని.

| | | |
|---|---|---|
| యమునాకళ్యాణి | .... | సరిగపమపధస-సధపమపగరిస. |
| హమీరుకళ్యాణి | .... | సపమపధనిస-సనిధపగ (మ)గరిస(శుమ) |
| శ్యామకళ్యాణి | .... | సరిగమపనిస-పనిపధపమగరిస. |
| సారంగ | .... | సరిగమపధనిస-సనిధపమరిగమరిస. |
| మైత్రిభావిని | .... | సరిగమపధనిస-సధపమగరిస. |
| కుంతలశ్రీకంఠి | .... | సగమపధనిస-సనిపమగరిస. |
| కామోద | .... | సరిగమనిస-సనిమగరిస. |
| శుద్ధకోసల | .... | సగమపస-సనిధమగరిస. |
| సునాదవినోదిని | .... | సగమధనిస-సనిధమగస. |
| కుంతలకుసుమావళి | .... | సరిగమపమపస-సనిధనిపమగస. |
| చంద్రకాంతము | .... | సరిగమపధనిస-సనిధపమగరిస. |
| శుద్ధరత్నభాను | .... | సరిగమపస-సనిధపమగస. |

### 66. చిత్రాంబరి-చరి-అంగ-ప్రమ-ప-షధ-కాని.

| | | |
|---|---|---|
| చతురంగిణి | .... | సమగమపనిస-సనిధనిపగమగరిస. |
| గగనరంజని | .... | సగమపస-సధనిపమగరిస. |







| | | |
|---|---|---|
| చూర్ణికావినోదిని | .... | సరిగమపధనిస-సనిధనిపమగరిస. |
| కనకభవాని | .... | సమగమపధనిస-సనిపమరిస. |
| నాగకుంతలి | .... | సరిగమపనిస-సనిపధనిపమగరిస. |
| దేవగీర్వాణి | .... | సగరిమపస-సపమగరిస. |
| విజయకోసలము | .... | సరిగమపమపస-సనిపమగస. |
| శుద్ధనిర్మద | .... | సరిగమపధనిపస-సనిపమగస. |

### 67.సుచరిత్ర-షరి-అంగ-ప్రమ-ప-శుధ-శుని.

| | | |
|---|---|---|
| కనకనిర్మద | .... | సరిగమపమధస-పనిధపమగరిస. |
| సత్యవతి | .... | సరిమపధనిధస-సనిధపమగమరిస. |
| రామకుంతలి | .... | సరిగమపధని-ధపమగరిసనిస. |
| సోమమంజరి | .... | సగమపధస-సధపమగరిస. |
| కుంతలభవాని | .... | సరిగమపమపస-సనిధనిపమరిస. |
| సేనాజయంతి | .... | సరిగమపధనిస-సధపమగరిస. |
| కనకగీర్వాణి | .... | సరిమపమధనిస-సధపమరిస. |

### 68. జ్యోతిస్వరూపిణి-షరి-అంగ-ప్రమ-ప-శుధ-కైని.

| | | |
|---|---|---|
| జ్యోతిష్మతి | .... | సరిమగపస- సనిధమపమరిగస. |
| శుద్ధ శృతిరంజని | .... | సరిమపధనిధస-సనిధపమగమరిస. |

| | | |
|---|---|---|
| భువనకుంతలి | .... | సరిగమపధస-సధపమగస. |
| కుంతలగీర్వాణి | .... | సరిగమపధనిస-సధమపమగరిస. |
| జౌడగాంధారి | .... | సరిగమపధస-సనిధపమగరిస. |
| హిందోళదేశాక్షి | .... | సనిసరిగమపధ- నిధపమగరిస. |
| కుంతలరంజని | .... | సరిమపనిధనిస-సనిధపమగరిస. |
| కుసుమభవాని | .... | సరిమపధస-సనిధమపమరిస. |

### 69. ధాతువర్ధని- షరి-అంగ-ప్రమ-ప-శుధ-కాని.

| | | |
|---|---|---|
| పద్మభవాని | .... | సరిగమపమధస-సనిధపమగరిస. |
| ధౌతపంచమము | .... | సరిగమపనిపస-సనిధపమరిగమరిస. |
| కుంతలసింహారము | .... | సరిమపమధనిస-సధపమరిస. |
| ధీరసావేరి | .... | సరిగమపధనిస-సధపమగరిస. |
| లలితకోసలి | .... | సరిగమపధనిధస-సనిధపమగమరిస. |
| నలినకుసుమావళి | .... | సరిగమపమపస-సనిధనిపమరిస. |
| బృందావన కన్నడ | .... | సగమపధస-సధపమగరిస. |
| ఈశగిరి | .... | సరిగమపధని-ధపమగరిసనిస. |







### 70. నాసికాభూషణి- షరి-అంగ-ప్రమ-ప-చధ-కైని.

| | | |
|---|---|---|
| గౌరీసీమంతి | .... | సరిగమపధనిస-సనిపమగస. |
| నాసామణి | .... | సరిగమపమపస-సనిధనిపమరిస. |
| కుంతలఘంటాణము | .... | సరిగమపమపస-సనిపమరిస. |
| నిగమసంచారి | .... | సగమపధనిస-సనిధనిపమరిస. |
| నీతికుంతలి | .... | సమగమపధనిస-సధనిపమగస. |
| హంసకోసలి | .... | సరిగమపధనిధస-సనిధపమగమరిస. |

### 71. కోసలము-షరి-అంగ-ప్రమ-ప-చధ-కాని.

| | | |
|---|---|---|
| కుసుమావళి | .... | సగమపధస-సనిధపమగమరిస. |
| ప్రతాపసారంగ | .... | సరిగమపధస-సనిధపమగస. |
| నాగగిరి | .... | సగమపధపస-సధపమగస. |
| కౌస్తుభప్రియ | .... | సరిగమపధనిస-సధపమగమరిస. |
| గౌరీనిషాధము | .... | సగమపనిధస-సనిధనిపమగస. |
| సత్యభూషణి | .... | సగమపధనిస-సనిధపమగస. |

### 72. రసికప్రియ-షరి-అంగ-ప్రమ-ప-షధ-కాని.

| | | |
|---|---|---|
| రసమంజరి | .... | సరిగమపధనిస-సనిపమరిస. |
| కనకజ్యోతిష్మతి | .... | సమపధనిస-సనిధపమస. |

| | | |
|---|---|---|
| హంసగిరి | .... | సరిగమపధనిస-సనిపధనిపమగస. |
| రీతిమల్లారు | .... | సరిగమపస-సనిపధనిపమగస. |
| గీర్వాణపదం | .... | సరిగమపధస-సనిధపమగరిస. |
| గిరికుంతలి | .... | సరిగమపమగమపస-సనిధనిపమగస. |

**డెబ్బది రెండు మేళకర్తల జన్యరాగములు సంపూర్ణము.**

ఇవిగాక మరికొన్ని రాగముల పేర్లు చెప్పబడినవి.

| సంఖ్య | రాగముల పేర్లు | మేళకర్త సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| 1 | అఠాణా | 29 | సరిమపనిపసనిస | సనిధాపమపగారిస |
| 2 | అసావేరి | 8 | సరిమపధస | సనిసపధమపరిగరిస |
| 3 | ఆనంధభైరవి | 20 | సగరిగమపధపనిస | సనిధపమగరిస |
| 4 | ఆంధాళి | 28 | సరిమపనిస | పనిపమరిగామరిస |
| 5 | ఆందోళిక | 28 | సరిమపనిస | సనిధమరిస |
| 6 | ఆభోగి | 22 | సరిగమధస | సధమగరిస |
| 7 | ఆభేరి | 20 | సగమపనిస | సనిధపమగరిస |
| 8 | ఆరభి | 29 | సరిమపధస | సనిధపమగరిస |
| 9 | ఆహిరి | 8 | సరిసగమపధనిస | సనిధాపమగరిస |
| 10 | ఈశమనోహరి | 28 | సరిగమపధనిస | సనిధపమరిమగరిస |







| | | | | |
|---|---|---|---|---|
| 11 | ఉదయరవిచంద్రిక | 20 | సగమపనిస | సనిపమగస |
| 12 | ఉమాభరణము | 28 | సరిగమపధనీస | సనిపమగమరిసనిస |
| 13 | కదనకుతూహలము | 28 | సరిమధనిగపస | సనిధపమగరిస |
| 14 | కదకవసంతము | 20 | సగమపనిస | సనిధపమగరిస |
| 15 | కన్నడ | 29 | గరిసరిగమపమధనిస | సనిసధపమపగమరిస |
| 16 | కాసడ | 22 | సరిగమపమధానిస | సనిపమపధనిధపమగామరిస |
| 17 | కమలామనోహరి | 27 | సగమపనిస | సనిధపమగస |
| 18 | కలగడ | 28 | సరిగపధసా | సనిధపాగరిస |
| 19 | కళానిధి | 22 | సరిగమసపమధనిస | సనిధపమగరిస |
| 20 | కళావతి | 14 | సరిమపధస | సధపమగసరిస |
| 21 | కాపి | 22 | సరిగమరిపమపధనిస | సనిధపమగరిస |
| 22 | కాపినారాయణి | 28 | సరిమపధనిస | సనిధపమగరిస |
| 23 | కామవర్ధిని మేళము | 51 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 24 | కాంభోజి | 28 | సరిగమపధస | సనిధపమగరిస |
| 25 | కిరణావళి | 21 | సరిగమపధనిస | సధపమగరిస |
| 26 | కీరవాణి మేళము | 21 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 27 | కుంతలవరాళి | 28 | సమపధనిధస | సనిధపమస |

| | | | | |
|---|---|---|---|---|
| 28 | కుతూహలము | 29 | సరిమనిధపనిస | సనిధపమగరిస |
| 29 | కురంజి | 29 | సనిసరిగమపధా | ధపమగరిసనిస |
| 30 | కేదారము | 29 | సమగమపనిస | సనిపధపమగరిస |
| 31 | కేదారగౌళ | 28 | సరిమపనీస | సనిధపమగరిస |
| 32 | కై కవశి | 60 | సరిగమపధనిస | సనిపమగరిస |
| 33 | కోకిలధ్వని | 28 | సరిగమధనిధస | సనిధనిపమగరిస |
| 34 | కోలాహలము | 29 | సపమగమపధనిస | సనిధపమగరిస |
| 35. | ఖమాసు | 28 | సమగమపధనిస | రిసనిధపమగస |
| 36. | ఖరహరప్రియమేళము | 22 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 37. | గమకక్రియ | 51 | సరిగమపధస | సనిధపమగమరీస |
| 38 | గరుడధ్వని | 29 | సరిగమపధనిస | సధపగరిస |
| 39 | గౌరీమనోహరి మేళము | 23 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 40 | గౌళ | 15 | సరిమపనిస | సనిపమగమరిస |
| 41 | చక్రవాకము మేళము | 16 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 42 | చలనాట మేళము | 36 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 43 | ఛాయాతరంగిణి | 28 | సరిగమపనిస | పనిధపమగరిస |
| 44 | ఛాయానాట | 34 | సరిగమపమపస | సనిధనిపమరిస |
| 45 | జనరంజని | 29 | సరిగమపధపనిస | సధపమరిస |







| | | | | |
|---|---|---|---|---|
| 46 | జయనారాయణి | 22 | సరిగమపధనిధస | సనిధపమగరిస |
| 47 | జింగల | 20 | సరిగమపధనిధపస | సనిధపమగరిస |
| 48 | జుజాహుళి | 13 | సమగమపధనిస | సధనిధపమగస |
| 49 | ఝుంఝూటి | 28 | ధసరిగమపధని | ధపమగరిసనిధపధస |
| 50 | తోడి | 8 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 51 | దర్బారు | 22 | సరిమపధనిస | సధపమరిగారిస |
| 52 | దేశ్యతోడి | 8 | సరిగమపధనిస | సనిధనిధపమగరిస |
| 53 | దేవమనోహరి | 22 | సరిమపనిధనిస | సనిధనిపమరిస |
| 54 | దేవగాంధారి | 29 | సరిమపధనిస | సనిధపమగరిస |
| 55 | దేక్షక్షి | 28 | సరిగపధస | సనిధపమగమరిస |
| 56 | ద్విజావంతి | 28 | సరిమగమపధనిస | సనిధపమగరిగస |
| 57 | ధన్యాసి | 8 | సగమపనిస | సనిధపమగరి |
| 58 | ధీరశంకరాభరణము మేళము | 29 | సరిగమపధనిస | సనిధపమగరిసస |
| 59 | నఠభైరవి మేళము | 20 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 60 | నవరసకన్నడ | 28 | సమగమపస | సనిధమగరిస |
| 61 | నవరోజు | 29 | పధనిసరిగమపా | మగరిసనిధప |
| 62 | నాగస్వరావళి | 28 | సగమపధస | సధపమగస |
| 63 | నాట | 36 | సరిగమపధనిస | సనిపమరిస |

| | | | | |
|---|---|---|---|---|
| 64 | నాటకురంజి | 28 | సరిగమధనిపధనిస | సనిధమగస |
| 65 | నాధనామక్రియ | 15 | సరిగమపధని | నిధపమగరిసని |
| 66 | నాయకి | 22 | సరిమపధనీదపస | సనీదపమరిగారిస |
| 67 | నారాయణగౌళ | 28 | సరిమపనిధనిస | సనిధపమగరిగరిస |
| 68 | నారాయణి | 28 | సరిమపధస | సనిధపమరిస |
| 69 | నీలాంబరి | 28 | సరిగమపధపనిస | సనిసమగరిగస |
| 70 | ప్రవాళశోధి | 28 | సరిమపధనిస | సనిధనిపమగస |
| 71 | పున్నాగవరాళి | 8 | నిసరిగమపధని | నిధపమగరిసని |
| 72 | పూర్వకళ్యాణి | 53 | సరిగమపధనిధస | సనిధపమగరిస |
| 73 | పూర్ణచంద్రిక | 29 | సరిగమపధపస | సనిపధపమగమరిస |
| 74 | పుష్పలతిక | 22 | సరిగమపనిస | సనిపమగరిస |
| 75 | ఫరజు | 15 | సగామపధనిస | సనిధపమగరిస |
| 76 | ఫలమంజరి | 22 | సగమధస | సనిధపమగమరిస |
| 77 | బంగాళా | 28 | సరిగమపమరిపస | సనిపమరిగరిస |
| 78 | బలహంస | 28 | సరిమపధస | సనిధపమరిమగస |
| 79 | బృందావనసారంగ | 22 | సగరిమపనిస | సనిపమరిగస |
| 80 | బిలహరి | 29 | సరిగపధస | సనిధపమగరిస |
| 81 | బేగడ | 29 | సగరిగమపధనిధపసా | సనిధపమాగరిస |







| | | | | |
|---|---|---|---|---|
| 82 | బౌళి | 15 | సరిగపధస | సనిధపగరిస |
| 83 | బ్యాగు | 29 | సగమపసనిస | సనిధపమగరిస |
| 84 | భవప్రియ మేళము | 14 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 85 | భూపాలము | 8 | సరిగపధస | సధపగరిస |
| 86 | మందారి | 50 | సరిగమపనిస | సనిపమగరిస |
| 87 | మధ్యమావతి | 28 | సరిమపనిస | సనిపమరిస |
| 88 | మలయమారుతము | 16 | సరిగపధనిస | సనిధపగరిస |
| 89 | మలహరి | 15 | సరిమపధస | సధపమగరిస |
| 90 | మాంజి | 20 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 91 | మాధవమనోహరి | 57 | సగరిగమపనిధనిస | సనిధమగరిస |
| 92 | మాయామాళవగౌళ మేళము | 15 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 93 | మారువ | 15 | సగమపధనిధపస | సనిధపమధమపమగరిస |
| 94 | మాళవి | 28 | సరిగమపనిమధనిస | సనిధనిపమగమరిస |
| 95 | ముఖారి | 22 | సరిమపనిధస | సనిధపమగరిస |
| 96 | మేఘరంజి | 15 | సరిగమనిస | సనిమగరిస |
| 97 | మేచకల్యాణి మేళము | 65 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 98 | మోహన | 28 | సరిగపధస | సధపగరిస |
| 99 | యదుకులకాంభోజి | 28 | సరిమపధస | సనిధపమగరిస |

| | | | | |
|---|---|---|---|---|
| 100 | యమునాకల్యాణి | 65 | సరిగపమపధస | సధపమగరిస |
| 101 | రవిచంద్రిక | 28 | సరిగమధనిధస | సనిధమగరిస |
| 102 | రామప్రియ మేళము | 52 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 103 | రిషభప్రియ మేళము | 62 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 104 | రీతిగౌళ | 20 | సగరిగమనిధమపనిస | సనిధమపధమగరిస |
| 105 | రేగుప్తి | 15 | సరిగపధస | సధపగరిస |
| 106 | లతాంగి మేళము | 63 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 107 | లలిత | 17 | సరిగమధనిస | సనిధమగరిస |
| 108 | వసంత | 15 | సగమధనిస | సనిధమగరిస |
| 109 | వరాళి | 30 | సగరిగమపధనిస | సనిధపమగరిస |
| 110 | వాచస్పతి మేళము | 64 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 111 | వీరవసంతము | 24 | సగరిమపస | సనిధపమగరిస |
| 112 | వేగవాహిని | 16 | సరిగమపధనిధస | సనిధపమగరిస |
| 113 | శహాన | 28 | సరిగమపమధనిస | సనిధపమగమరిగరిస |
| 114 | శుద్ధసావేరి | 29 | సరిమపధస | సధపమరిగరిస |
| 115 | శుద్ధబంగాళా | 22 | సరిమపధస | సధపమరిగరిస |
| 116 | శుద్ధసామంతము | 8 | ధసరిమపధ | ధపమగరిస |







| | | | | |
|---|---|---|---|---|
| 117 | శుభపంతువరాళి మేళము | 35 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 118 | శోకవరాళి | 9 | సగమనిధ | పమగరిస |
| 119 | శ్యామకల్యాణి | 65 | సరిగమపనిస | సనిపధపమగరిస |
| 120 | శ్యామ | 28 | సరిమపధస | సధపమగరిస |
| 121 | శ్రీరంజని | 22 | సరిగమధనిస | సనిధమగరిస |
| 122 | శ్రీరాగము | 22 | సరిమపనిస | సనిపధనిపమరిగరిస |
| 123 | శుద్ధతోడి | 8 | సరిగమధనిస | సనిధమగరిస |
| 124 | షడ్విధమార్గిణి మేళము | 46 | సరిగమధనిస | సనిధపమగరిస |
| 125 | షణ్ముఖప్రియ మేళము | 56 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 126 | సరసాంగి మేళము | 27 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 127 | సరస్వతి | 64 | సరిమపధస | సనిధపమరిస |
| 128 | సరస్వతీమనోహరి | 28 | సరిగమధస | సనిధపమగరిస |
| 129 | సారంగ | 64 | సరిగమపధనిస | సనిధపమరిగమరిస |
| 130 | సావేరి | 15 | సరిమపధస | సనిధపమగరిస |
| 131 | సింహేంద్రమధ్యమము మేళము | 57 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 132 | సురటి | 28 | సరిమపనిస | సనిధపమగపమరీస |
| 133 | సుపోషిణి | 28 | సరిసమపనిధస | సధనిపమరిమస |

| | | | | |
|---|---|---|---|---|
| 134 | సైంధవి | 22 | నిధనిసరిగమ | పమగరిసనిధనిస |
| 135 | సౌరాష్ట్ర | 15 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 136 | హంసధ్వని | 29 | సరిగపనిస | సనిపగరిస |
| 137 | హరికాంభోజి మేళము | 28 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 138 | హుసేని | 22 | సరిగమపనిధమపనిధనిస | సనిధపమగరిస |

## వాగ్గేయకారుల చరిత్రలు

మనం అందరం గుర్తుంచుకోవలసిన విషయం. రాగం అంటే కేవలం ఆరోహణ, అవరోహణేకాదు, ఆరోహణ, అవరోహణ అన్నది ఆ రాగానికి ఒక ఆధారం. ఈ ఆధారంతో రాగానికి ఒక స్వరూపాన్ని వాగ్గేయకారులు ఇస్తారు. అంటే ఆ రాగంలో ఉన్న గమకాల్ని, స్వరాల్ని, దృష్టిలో ఉంచుకొని ఆ రాగానికి ఒక పూర్తి ఆకారాన్ని, తీర్చి దిద్దుతారు. పాటల్ని రచిస్తారు. అప్పుడే అది పరిపూర్ణమైన రాగం అవుతుంది. ఇంకా చెప్పాలంటే ఆరోహణ, అవరోహణ, అన్నది రాగం యొక్క అస్థిపంజరం లాంటిది. వాగ్గేయకారులు ఈ అస్థిపంజరానికి రక్త మాంసాల్ని కూర్చి పైన చర్మం తొడిగి దానికి స్పష్టమైన ఆకారాన్ని ఇస్తారు.

13వ శతాబ్దంలో ఉత్తర భారతదేవాన్ని మహమ్మదీయులు పాలిస్తుండేవారు. వీరితోపాటు పర్షియా, అరబ్బు దేశాల సంగీతాలు కూడా మనదేశంలోకి వచ్చాయి. అలా వచ్చి మన భారతీయ సంగీతంలో కలిసిపోయాయి. మన భారతీయ సంగీతం, పర్షియా, అరబ్ దేశాల సంగీతాలతో కలిసి ఒక కొత్త సంగీతం రూపొందింది. అలా ఏర్పడిన సంగీతమే హిందూస్థానీ సంగీతం.

దక్షిణ భారతదేశానికి విదేశీయులు ఎక్కువగా రాకపోవడంతో పర్షియా, అరబ్ దేశాల సంగీతాలు ఇక్కడికి ప్రవేశించలేదు. అందుచేత ఆ దేశంలో ఉన్న సంగీతం ఎక్కువ మార్పులు చెందకుండా ఉండిపోయింది. ఇలా మార్పు చెందని సంగీతమే కర్ణాటక సంగీతము అయింది. ప్రస్తుతం ఉత్తర భారతదేశం అంతా హిందూస్థానీ సంగీతమే. కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళ, కొంకణి ప్రాంతాల్లో కర్ణాటక సంగీతం ప్రచారంలో ఉంది.







ఒరిస్సా, మహారాష్ట్ర ఇంకా కొన్ని ప్రాంతాలలో కర్ణాటక సంగీతం, హిందూస్థానీ సంగీతం రెండూ ప్రచారంలో ఉన్నాయి. అసలు కర్ణాటక సంగీతానికి ఆ పేరు ఎలా వచ్చిందంటే కర్ణాలకు (చెవులకు ) ఇంపుగా ఉండేదాన్ని కర్ణాటక సంగీతమంటారు. "కరై" అంటే సముద్రతీరం. 'నాడు' అంటే దేశం. 'కరైనాడు' అంటే సముద్రతీరాన ఉన్న దేశం అన్నమాట. మన దక్షిణ భారతదేశం సముద్రతీరాన ఉన్నది కనుక దీనిని పూర్వం నుండి 'కరైనాడు' 'కరనాడు' అని పిలుస్తూ ఉండేవారు. ఈ కరనాడు అనే పదమే కర్ణాటకగా మారింది. కర్ణాటక దేశం అంటే దక్షిణ భారతదేశం అన్నమాట. కనుక ఈ దేశంలో ప్రచారంలో ఉన్న సంగీతాన్ని కర్ణాటక సంగీతం అని పిలిచారు. ఈ విధంగా కర్ణాటక సంగీతానికి ఆ పేరు వచ్చింది.

ఇప్పటిదాకా మనం సంగీతం గురించి తెలుసుకున్నాం. ఇప్పుడు కొంతమంది వాగ్గేయకారుల చరిత్రలను గురించి కూడా తెలుసుకుందాము. ఈ వాగ్గేయకారులంతా కూడా భక్తులే. వీరిలో సంగీతంతో మోక్షాన్ని పొందినారని పెద్దలు చెపుతుంటారు. వీరి అందరి గురించి మనం తెలుసుకుందాము.

### జయదేవుడు

జయదేవులు 12వ శతాబ్దము నాటి వారు. ఉత్తరదేశ బెంగాలు రాష్ట్రంలో దిందుబిల్వం అనే గ్రామంలో '1098'లో జన్మించాడు. ఇది ఒరిస్సారాష్ట్రంలో పూరీ జగన్నాధంకు దగ్గరగా ఉంది. సంతానం కోసం జగన్నాధుని పూజించగా ఆ స్వామి దయవల్ల వీళ్ళకు జయదేవుడు పుట్టాడు. తల్లి రామాంబ తండ్రి భోజదేవుడు. వీరు బ్రాహ్మణోత్తములు. భార్య పద్మావతి శ్రీ కృష్ణ భక్తురాలు. ఈయన గురువుగారు గోవర్ధనాచార్యులు ఈయన శిష్యులందరిలో ప్రధముడు జయదేవుడు. శృంగారరస ప్రధానమైన శ్రీరాధాకృష్ణ ప్రేమతత్త్వమును ద్వాదశ సర్గసహితమగునట్లు విలసిల్లెడి 'గీతగోవిందం' (అష్టపది) అను పేరిట గాంధర్వంగా రచించిన అద్వితీయులు. ఈ జయదేవ కవీంద్రులు 19వ అష్టపది వ్రాయునపుడు "స్మర గరళ ఖండనం, మమశిరసి మండనం, దేహిపద పల్లవ ముదారం" అని తలంపుకు వచ్చినప్పటికి వ్రాయక తాటాకును తన భార్య పద్మావతికిచ్చి నదికి స్నానానాకి వెళ్ళెను. వెంటనే శ్రీ కృష్ణ భగవానులు తలంటుకొన్న జయదేవ రూపంతో

వచ్చి పద్మావతిని పిలిచి తాటాకును, లేఖినిని పుచ్చుకొని తనకు తోచినట్లుగా సాహిత్యం రచించి పూర్తిచేసి అంతర్ధానమయినారు. స్నానానంతరము జయదేవులు భార్యను తాటాకును లేఖినిని తెమ్మని అడుగ ఆమె ఆశ్చర్యంతో "ఇప్పుడే తాము వచ్చి వ్రాసి యిచ్చిపోతిరని" చెప్పి తాటాకును ఇచ్చెను. పూర్తిగా రచించిన దాన్ని చూచి ఆనందంతో "ఓ పద్మావతి నీవేమి సుకృతము చేసితివోకదా! భగవంతుడు నీకు దర్శనమిచ్చాడు" అని పొగుడుచు నా అష్టపది యెనిమిదవ యడుగున "జయత పద్మావతీ రమణ జయదేవకవి భారత ఫణితమితిగతం'అని 21వ అష్టపదిలోను తన నామమునకు ముందును ఆమె పేరు పెట్టెనట. ఈ అష్టపదులు కీర్తనకు 8 పాదముల చొప్పున 24 కీర్తనలు, నాయికా, నాయకీ, సఖులచే పాడబడుచుండును. సంగీత కీర్తనలకు అష్టపదులే ప్రప్రథమములుగా నున్నవని తెలియుచున్నది. ఈ అష్టపదుల ననుసరించి "రామాష్టపది" రామకవియు "శివాష్టపది" చంద్రశేఖరేంద్ర సరస్వతి కవియు రచించిరి. 12, 13 శతాబ్దాల నుంచి అష్టపదులు మన దేశం అంతా బాగా ప్రచారంలో ఉన్నాయి. పూరీలో జగన్నాథస్వామి పూజ చేసేటప్పుడు ఇప్పటికి అష్టపదుల్ని పాడుతుంటారు. జయదేవుడి అష్టపదుల్లో 'హరిరిహముగ్ధవధూనికరే' 'సావిరహేతవదీనారాధా' అనేవి బాగా ప్రచారంలో ఉన్నాయి. పాడుకొనేందుకు వీలైన మొదటి రచనలు జయదేవుడి అష్టపదులే.

క్రీ.శ. 1153లో జయదేవుడు మరణించాడు. వీరు శార్జ్గదేవుల కాలము నాటి వారని తెలియుచున్నది.

## పురందర విఠలదాసు

## కర్ణాటక సంగీత పితామహ

మహారాష్ట్రమున పవిత్రక్షేత్రంగా ప్రసిద్ధిగాంచిన పండరీపురమునకు సమీపమున 'పురందరగడ' మను గ్రామమున 15వ శతాబ్దమున వరదప్పనాయకుడను బ్రాహ్మణుడు ఉండెడివాడు. ఆయన భార్య కమలాంబ. వరదప్పనాయకుడు బంగారం, వడ్డీవ్యాపారముల వలన ధనం సంపాదిస్తుండేవాడు. సంతానం లేదని పరితపిస్తున్న ఈ దంపతులకు శ్రీనివాసుని సేవాఫలముగ క్రీ.శ. 1480వ సం॥ ఒక బిడ్డ పుట్టెను. శ్రీనివాస వర ప్రసాదితుడగు ఇతనిని ఆ దంపతులు శ్రీనివాస నాయకుడని నామకరణం చేసారు. అందరూ ముద్దుగా శీనప్పా







అని పిలుస్తుండేవారు. ఈ శీనప్పే వాగ్గేయకారుడైన పురందరదాసు. ఇతనికి చిన్నతనంలోనే ఉపనయనం చేసి విద్యావంతుని చేసినాడు. సంస్కృతం, కన్నడం భాషల్లోను, సంగీతంలోను మంచి ప్రావీణ్యం గణించాడు. తల్లితండ్రులు మరణించాక వ్యాపారం చేసి బాగా డబ్బు సంపాయించి కోటీశ్వరుడయ్యాడు. ఇంత సంపాయించినా ఎవరికీ దానధర్మాలు చేసేవాడు కాదు. పరమలోభిగా ఉండేవాడు. యుక్త వయస్సు రాగానే శీనప్పకు సద్వంశ సంజాతయు, సదాచార సంపన్నమగు 'శ్రీ సరస్వతీబాయి' అను నామెతో వివాహము జరిగి గృహస్థాశ్రమాన్ని స్వీకరించాడు. ఈయన బంగారం, వడ్డీవ్యాపారమేగాకుండా రత్నాల వ్యాపారం కూడా చేసేవాడుట.

ఒకనాడు ఒక పేద బ్రాహ్మణుడు పురంరదాసు దగ్గరకు వచ్చి 'నా కొడుకు ఉపనయనం చేసుకోవడానికి ధనం సాయం చెయ్యమని' అడిగాడు. పురందరదాసు ఆ బ్రాహ్మణుని రేపురా అని పంపేశాడు. ఆ బ్రాహ్మడు మళ్ళీ మరునాడు వచ్చాడు. మళ్ళీ రేపురా అని పంపేశాడు. ఇలా చాలా రోజులు డబ్బులు ఇవ్వకుండా తిప్పుతుంటే ఆ బ్రాహ్మడికి విసుకువచ్చి ఆయన భార్య దగ్గరకు వెళ్ళి సహాయం చెయ్యమని అడిగాడు. ఆమెకు దేవుడంటే ఎంతో భక్తి దానగుణం కూడా ఎక్కువే. వెంటనే తన ముక్కుకి ఉన్న ముక్కు పుడకను తీసిచ్చి దీంతో అమ్మగా వచ్చిన డబ్బుతో ఒడుగు చెయ్యమని చెప్పింది. బ్రాహ్మడు ఆ పుడకను తీసుకుని పురందరదాసు దగ్గరకే వెళ్ళాడు. దాన్ని చూసిన వెంటనే ఆయన ఇది తన భార్యదేనని గుర్తుపట్టి ఒక సేవకుడ్ని ఇంటికి పంపి ముక్కుపుడకను పట్టుకు రమ్మన్నాడు. ఆ సేవకుడు ఇంటికి వచ్చి అడిగేసరికి ఆమె కంగారు పడింది. ఇప్పుడు ఇచ్చి పంపకపోతే తన భర్త తనను హింసిస్తాడు. అందుచేత మరణించడమే మంచిది అనుకుని ఒక పాత్రలో విషం తీసుకుని తాగబోయింది. ఇంతలో ఆ విషం గిన్నెలో పుడక కనిపించేసరికి ఆమె ఎంతో ఆనందించి స్వామికి దణ్ణం పెట్టుకుని సేవకుడికి ఇచ్చి పంపింది. దాన్ని చూసి పురందరదాసు ఆశ్చర్యపోయాడు. వెంటనే ఇంటికివెళ్ళి భార్యను అడిగేసరికి జరిగిన విషయం అంతా చెప్పింది. ఆ విషయం విన్న పురందరదాసుకి జ్ఞానోదయం అయ్యింది. వెంటనే ఆ బ్రాహ్మణుడి కోసం వెతికాడు. ఎక్కడా కనిపించలేదు. ఆ బ్రాహ్మణుడు సాక్షాత్తూ "పుండరీకవిఠలుడే"అని గ్రహించాడు. ఈ సంఘటన ఆయన జీవితాన్నే మార్చివేసింది. తను సంపాదించిన ధనం అంతా పేదలకి దానం చేశాడు. "పుండరీక విఠలుడి" భక్తుడిగా మారిపోయి కీర్తనలు రచించడం ప్రారంభించాడు.

పురందరదాసు 'వ్యాసరాయలు' అనే ఆయన శిష్యుడు. ఈయనకి ఆ పేరు పెట్టింది కూడా ఆయనే. పురందరదాసు దేశంలో ఉన్న చాలా దేవాలయాల్ని సందర్శించాడు. ఆయన భక్తికి మెచ్చి ఎన్నో సార్లు విఠలుడు దర్శనం ఇచ్చాడు. ఈయన రచనలు ఎక్కువ కన్నడభాషల్లో ఉన్నాయి. ఈయన రచనల్ని 'దాసర పదగళు' అని కాని, దేవనామాలు అని కూడా అంటుంటారు.

ఈ రచనల్లో మంచి ఉపమానాలు, చక్కని ఉదాహరణలు ఉంటాయి. పురందరదాసు **4,75,000** రచనలు చేసాడని చెప్తుంటారు. ద్విజావంతి, శ్యామకళ్యాణి, మాధవి లాంటి అపురూప రాగాల్లో కూడా కీర్తనలు రచించాడు. అలా సంకీర్తనలు చేస్తూ దేశాటన చేసినారు. తీర్థక్షేత్రములను సందర్శించుచు బయలుదేరిన దాసులవారు భగవత్ప్రేరణచేత విజయనగరం చేరారు.

ఆ రాజ్యం సమర్థుడైన కృష్ణదేవరాయల పరిపాలనలో అత్యంత ఉన్నత స్థితిలో ఉన్నది. ఆ సమయంలో వ్యాసరాయల వారు కృష్ణదేవరాయల ప్రార్థనతో ఆ స్థానగురు పీఠమును అలంకరించినారు.

వ్యాసరాయల వారు ఒక శుభముహూర్తాన తప్తముద్రాంకితులుగా చేసి భగవదాజ్ఞానుసారం "పురందరవిఠల" అను నామమును గ్రహించినారు. బంగారమునకు తావియచ్చినట్లు గురూపదేశంతో దాసులవారు శ్రీనివాసనాయకుడనికాక పురందరదాసుగా ప్రసిద్ధిచెందినారు. ఈ ఆనంద సమయమును మైమరచి భావావేశంతో దాసులవారు

"హరిదాసరసంగదొరకిత ఎనగీగ ఇన్నే నిన్నేను
చిన్మయపురందర విఠలయ్య దొరకిద ఇన్నే నిన్నేను"!

అని గానము చేసినారు. పుత్రులను గురుపాదారవిందములందర్పించి వ్యాసరాయలవారి సేవలో ఎంతో సంతోషంతో కాలం గడిపినారు. ఉపనిషదర్థగర్భితములగు అనేక పద, పద్య, సూళాదులను నిరంతరము రచియించి గురుదక్షిణగా సమర్పించినారు. కొంత కాలానికి రాయలవారికి "కుహయోగము" సంప్రాప్తించినది. తన శిష్యునకు సంభవించిన దుర్యోగమును నివారించి వ్యాసరాయలవారు సింహాసనారూఢులై సకలమర్యాదలందినారు. ఈ రమణీయ దృశ్యాన్ని దాసులవారు కమనీయముగా "వ్యాసరాయ రచరణ దర్శనవెనగె" అను సూళాదిలో







"శేషావేశ ప్రహ్లాద నవతారవెనిసిదె
లేశ నిన్నంథ వెగ్గళర కాణెనోనాను" అని అభివర్ణించినారు. ఈ విధంగా గురువుల వైభవాన్ని తమకు గావించిన ఉపకారములను స్మరించుచు అనేక క్షేత్రములకు పోయి వచ్చుచుండెడివారు.

పురందరదాసు తిరుపతి వచ్చి అన్నమయ్యను కూడా కలుసుకున్నాడు. వేంకటేశ్వరుడిపైన కీర్తనలు రచించాడు. అందులో "వెంకటాచల నిలయం" అన్న కీర్తన, వినాయకుడిపైన 'గజవదన బేడువే" అన్న కీర్తన బాగా ప్రచారంలో ఉన్నాయి. శంకరాభరణరాగంలో "జోజో శ్రీకృష్ణ" అనే జోలపాట కన్నడ తల్లులు తమ పిల్లల్ని నిద్రపుచ్చుటకు పాడుతుంటారు. ముఖారి రాగంలో శారదా స్తోత్రం, మధ్యమావతిలో లక్ష్మీ స్తోత్రం చాలా ప్రసిద్ధి చెందినది. పురందరదాసు మాయామాళవగౌళరాగంలో సరళీస్వరాలు, జంటస్వరాలు, అలంకారాలు, పిళ్ళారి గీతాలు కూడా ఈయన రచించినవే. సంగీతం నేర్చుకొనే విద్యార్థులకు ఇవి ఎంతో ఉపయోగపడుతున్నాయి. అందుచేత పురందరదాసుని "ఆదిగురువు" అని "కర్ణాటక సంగీత పితామహుడు" అని కూడా అంటారు.

పురందరదాసు హంపిలో ఒక మండపంలో ఉండేవాడు. ఆ మండపాన్నే పురందరమండపం అని పిలుస్తారు. ఈయన చనిపోయేముందు సన్యాసం తీసుకున్నాడు. పురందరదాసు **2-1-1564**లో శ్రీకృష్ణుడిలో కలిసిపోయినాడు.

## అన్నమయ్య

మొదటిసారిగా తెలుగులో పాటల్ని రాసింది అన్నమయ్య. జయదేవుడి అష్టపదులు సంస్కృతంలో ఉన్నాయని తెలుసుకున్నాము. తెలుగులో పాటల్ని రాసిన అన్నమయ్య గురించి ఇప్పుడు తెలుసుకుందాము.

అన్నమయ్య పుట్టింది కడప జిల్లా దగ్గర ఉన్న తాళ్ళపాక. తల్లితండ్రులు లక్కమాంబ, నారాయణసూరులు. తల్లి వెంకటేశ్వరస్వామి భక్తురాలు. స్వామి దయవల్ల ఆ దంపతులకు క్రీ.శ. **1408**లో అన్నమయ్య పుట్టాడు. తల్లి చిన్నతనం నుంచే స్వామిపైన భక్తిని అతనికి రంగరించి పోసింది. ఐదేళ్ళకే అన్నమయ్యకు ఉపనయనం జరిగింది. అన్ని విద్యల్లోను అంటే సంగీతం, సాహిత్యంలో మంచి ప్రావీణ్యత

సంపాదించాడు. ఎనిమిదేళ్ళ అన్నమయ్య ఇంట్లో పెద్దవాళ్ళు గడ్డికోయమంటే కొడవలి పుచ్చుకొని, గడ్డి కోస్తుంటే వేలు తెగింది. వెంటనే 'హరి హరీ' అంటూ భగవంతుణ్ణి తలచుకొన్నాడు. ఇంతలో తిరుపతి వెళుతున్న కొందరు యాత్రికులు కనపడ్డారు. వాళ్ళతో కలిసి 'తిరుపతి' బయలుదేరి వెళ్ళిపోయాడు. కొండ ఎక్కసాగాడు. మోకాళ్ళ పర్వతం దగ్గరకి వచ్చేసరికి అలసట, ఆకలి కలిగాయి. ఒకచోట అలాగే పడి నిద్రపోయాడు. "అలిమేలుమంగ" ప్రసాదం తీసుకొచ్చి అతని ఆకలి తీర్చింది. అలిమేలు మంగను చూసి ఆనందంతో ఒక శతకం రాశాడు. అన్నమయ్య (శతకం అంటే వంద పద్యాలు) అన్నమయ్య కొండపైకి చేరాడు. తీరా గుడి దగ్గరకు వెళ్ళేసరికి తలుపులు మూసి వున్నాయి. అప్పుడు ఒక శతకాన్ని వెంకటేశ్వరస్వామిపైన రచించేసరికి గుడితాళాలు వాటంతట అవే ఊడి తెరుచుకున్నాయి. అతని మహిమకు అందరూ ఆశ్చర్యపోయారు. కన్నులారా శ్రీనివాసుడి దర్శనం చేసుకుని స్వామి ఆదేశం మేరకు తిరిగి తాళ్ళపాక చేరాడు. తిరుమలమ్మ, అక్కలమ్మ అనే ఇద్దరితో పెండ్లి జరిగింది. వెంకటేశ్వరస్వామిపై ఎన్నో కీర్తనలు రచిస్తూ కాలం గడుపుతున్నాడు అన్నమయ్య.

టంగుటూరును పాలిస్తున్న సాళువనరసింహరాయలు అన్నమయ్య గొప్పదనాన్ని విని తనని సంస్థానానికి రప్పించుకొని అన్నమయ్య రచించిన కీర్తనలు విన్నాడు. తనపై కూడా అలాంటి కీర్తనలు రచించమని అడిగినాడు. "భగవంతుడ్ని పొగిడిన నా నోటితో నిన్ను కీర్తించను" అని అనేసరికి రాజుకు కోపం వచ్చి సంకెళ్ళు వేసి చెరసాలలో వేయించాడు. అప్పుడు అన్నమయ్య 'ఆకటి వేళల అలపైన వేళల' అనే కీర్తన రచించి పాడేసరికి సంకెళ్ల వాటంతట అవే తెగిపోయాయి. ఆ విషయం భటులద్వారా విన్న రాజు అన్నమయ్య సామాన్యుడు కాదని తెలుసుకుని క్షమించమని అన్నమయ్యను వేడుకొని విడుదల చేసాడు.

అన్నమయ్య 32వేల కీర్తనల్ని రాశాడు. ఇది ఆధ్యాత్మిక సంకీర్తనలు, శృంగార సంకీర్తనలు అని 2 రకాలు. అన్నమయ్య తరువాతివారు వాటిని రాగిరేకులపైన రాసి భద్రపరిచారు. కాని మనకు దొరికిన కీర్తనలు, శతకాలు, గ్రంథాలు చాలా తక్కువే. వీటిలో "కొండలలో నెలకొన్న కోనేటి రాయుడువాడు, బ్రహ్మకడిగినపాదము, అదివో అల్లదివో శ్రీహరివాసము, ముద్దుగారేయశోద,తందనాన ఆహి, నానాటి బతుకు నాటకము, పలుకుతేనెలతల్లి పవళించెను, భావములోన బాహ్యమునందును, శ్రీమన్నారాయణ, ఏముఖో చిగురుటధరమున, లాంటి ఎన్నో అన్నమయ్య కృతులు ప్రచారంలో ఉన్నాయి.







అన్నమయ్య ముద్ర 'వెంకటేశ', 'శ్రీవెంకటేశ' 'తిరువెంకటేశ' అని తనకి ఇష్టమైన వెంకటేశ్వరస్వామి పేరునే ముద్రగా వాడాడు. తెలుగులో, సంస్కృతంలో కూడా కీర్తనలు రాశాడు. ఈయనకు 'పదకవితా పితామహుడు' అనే బిరుదు కూడా కలదు. అన్నమయ్య క్రీ.శ. 1503 సం॥లో వేంకటేశ్వరస్వామిలో ఐక్యం అయ్యాడు.

## త్యాగయ్య

తంజావూరు మండలంలో తిరువాయూర్ గ్రామంలో పంచనదబ్రహ్మం అనే కుటుంబీకుడు ఉండేవారు. ఆయనకు సదాశివ బ్రహ్మం, సదానందబ్రహ్మం, సచ్చిదానంద బ్రహ్మం, బాల బ్రహ్మం, గిరిరాజ బ్రహ్మం అనే 5 గురు కొడుకులు కలరు. చివరివాడైన గిరిరాజబ్రహ్మం 'గిరిరాజకవి'గా కూడా ప్రసిద్ధి పొందినాడు. ఈయన అనేక యక్షగానాలు, వేదాంత వాక్యాలు వ్రాసి తంజావూరు ప్రభువు శరభోజి మహారాజు మన్ననలు పొంది వారి ఆస్థానకవి పదవి అలంకరించారు. గిరిరాజకవికి ఐదుగురు కొడుకులు. వారిలో కడపటివాడు రామబ్రహ్మం, తండ్రిలాగే విద్వాంసుడు. ఆయన భార్యపేరు సీతమ్మ, సాధ్వీమణి. ఈ దంపతులకు పంచాపకేశం, రామనాథం అనే ఇద్దరు కొడుకులు పుట్టారు. వీళ్ళిద్దరూ కూడా పోకిరివాళ్ళు కావడం వల్ల ఆ తండ్రికి పుత్రోత్సాహం కలుగలేదు. వంశానికి పేరు తెచ్చే కొడుకు కావాలని తిరువాయూరు దైవమైన శ్రీ త్యాగరాజస్వామి వారికి మొక్కుకున్నారు. ఆ స్వామి కరుణించి 'సంగీత సాహిత్య కళాకోవిదుడైన పుత్రుడు పుడతాడని ఒక రాత్రి కలలో రామబ్రహ్మంకు అభయమిచ్చాడు.

సర్వజిత్ సంవత్సరం, చైత్రమాసం, సోమవారం పుష్యమినక్షత్ర కటకలగ్నంలో అంటే ఆంగ్ల కాలమాన ప్రకారం 1767 సం॥ మే 4వ తేదీన త్యాగయ్య శుభజననం జరిగింది. త్యాగరాజస్వామివారి వరంగా జన్మించడం వల్ల ఆ స్వామి పేరిటే త్యాగయ్యకు పేరు పెట్టటం జరిగింది. త్యాగయ్య పుట్టింది ములకనాడు తెలుగుబ్రాహ్మణుల ఇంట. కాకర్లవంశం వారిది. కాకర్లాంబుధి చంద్రుడనని ఆయన సగర్వంగా చెప్పుకొనేవారు. త్యాగయ్య భారద్వాజ గోత్రుడు, ఆపస్థంభసూత్రుడు, ఈయన జన్మించే నాటికి కుటుంబం దరిద్రంతో కుమిలిపోతుంది. దాంతో వారు బ్రతుకుతెరువుకోసం క్రీ.శ. 1774లో తిరువాయూరును విడిచిపెట్టి తిరువైయార్ చేరుకున్నారు రామబ్రహ్మం కుటుంబమంతా.

తంజావూరు రెండవప్రభువైన తులజాజి రామబ్రహ్మం ప్రతిభను గుర్తించి తన సంస్థానానికి ఆహ్వానించాడు. ప్రతి ఏటా జరిగే శ్రీరామనవమి ఉత్సవాలలో వాల్మీకి రామాయణ ప్రవచనం జరిపేవారు రామబ్రహ్మం. పండిత సంభావనగా రామబ్రహ్మంకు తిరువైయారు అనే పంచనదక్షేత్రంలో ఒక ఇంటిని, కొంతమాగాణిని ప్రసాదించారు. దాంతో ఆయన జీవితం సాఫీగా జరిగిపోసాగింది. తను కోరుకున్న కొడుకు కలగడంతో ఆయన చింతలన్నీ తీరిపోయాయి.

త్యాగయ్య కవి, పండితుడు కూడా. పితామహుడు గిరిరాజకవి. తంజావూరు ఆస్థాన కవి. మాతామహుడు వీణకాళహస్తి అయ్యర్ కూడా తంజావూరు సంగీత విద్వాంసులే. వారసత్వంగా తండ్రి వైపు నుండి సాహిత్యం, తల్లివైపు నుండి సంగీతాంశ రెండూ కలిపి ఈయనను పుట్టుకతోనే వాగ్గేయకారుణ్ణి చేశాయి. సంగీతానుకర్తేకాదు, రామభక్తికూడా త్యాగయ్యకు తల్లిదండ్రులనుంచే సంక్రమించింది. ఎనిమిదో ఏట ఉపనయనం జరిగింది. చిన్న వయస్సులోనే తండ్రి వెంట రాజస్థానానికి వెళ్ళేవాడు. వాల్మీకిరామాయణశ్లోకాలు చదివి చెప్తుంటే వాటి భావాన్ని సభకు వివరించేవాడు తండ్రి. అలా రామాయణంతోను, రామభక్తితోను ఆ బాల్యంలోనే అనుబంధం ఏర్పడింది త్యాగయ్యకు. రామబ్రహ్మం త్యాగయ్యకు మొదటి గురువు. తల్లి మంచిగాయని. పురందరదాసు, జయదేవుడు అన్నమాచార్యుడు మొదలైన వారందరి సంగీతాన్ని చిన్నపుడే ఉగ్గుపాలతో రంగరించిపోసింది. తండ్రి శిక్షణ ముగిసిన వెంటనే సంస్కృత పాఠశాలలో ప్రవేశించాడు. సంస్కృత, తెలుగు సాహిత్యాలలోనేగాక గణిత, జ్యోతిష,మంత్ర శాస్త్రాలలో కూడా పాండిత్యం గడించాడు. తండ్రికి పూజకోసం పూలను రోజూ దూరంగా ఉన్న తోటకు వెడుతుండేవాడు. ఈ మధ్యదారిలోనే సంగీత విద్వాంసులయిన శొంఠి వెంకటరమణయ్యగారి ఇల్లుంది. ప్రతిరోజూ వారి ఇంటి ముందు నిలబడి ఆ ఇంట్లో నుండి వచ్చే రాగ ప్రస్తారాన్ని వింటూ నిలబడేవాడు. ఇలా ఒక రోజు తండ్రి కంట్లో పడ్డాడు. కొడుకు సంగీతాభినివేశం మనసుకునచ్చి ఆయన వెంటనే రమణయ్యగారిని ఆశ్రయించి త్యాగయ్యకు నాదవేదం అనుగ్రహించమని అడగ్గానే ఆయన కూడా తథాస్తు అన్నారు. అలా శొంఠి వారి వద్ద త్యాగయ్య సంగీత పాఠాలు ప్రారంభమైనవి.

భావావేశం పెల్లుబికినపుడల్లా బొగ్గు ముక్కతో ఇంటి గోడలపై కొన్ని కీర్తనలు వ్రాశాడు త్యాగయ్య. వాటిని చదివి రామబ్రహ్మం పరమానందభరితుడై రామశేషశాస్త్రి భాష్యం కృష్ణశాస్త్రి వంటి సంగీతవేత్తలకు చదివి వినిపించగా వారు భళీ అని తెగ మెచ్చుకున్నారట.






"నమో నమో రాఘవాయ అనిశం

నమో నమో రాఘవాయ (దేశికతోడి- తిశ్ర)

తవదాసోహం తవ దాసోహం

తవదాసోహం దాశరథే (పున్నాగవరాళి-ఆది)

ఇవే ఆయన తొలి కీర్తనలుగా చెప్తూ ఉంటారు. శొంఠివారు సంగీత మర్మాలన్నింటిని ఒక్క ఏడాదిలోనే రంగరించి పోశారు. తన శిష్యుడి మధురగానాన్ని తంజావూరు సంగీత విద్వాంసుల్ని కొందరిని తమ ఇంటికి ఆహ్వానించి వారి సమక్షంలో కీర్తన పాడమన్నారు. గురువుగారి ఆదేశాన్ని శిరసావహించి 'దొరకునా ఇటువంటి సేవ' అనే కీర్తన బిలహరిలో పాడినాడు. ఆ మధురగానాన్ని అందరూ మెచ్చుకునే సరికి తన అదృష్టానికి మురిసిపోయి మహారాజు ఇచ్చిన 'మకరకంఠి' అనే అమూల్యాభరణాన్ని తన శిష్యునికి అలంకరించి సంతృప్తి చెందారు. ఆస్థాన సంగీత విద్వాంసులూ, తన తండ్రి శొంఠి వెంకట సుబ్బయ్యగారికి కూడా త్యాగయ్య గానం వినిపించాలని ఆనాటి సమావేశంలో తీర్మానించారు. అందరూ కలిసి ముహూర్తం నిర్ణయించి ఒకటి రెండు గంటలు సంగీతం విని తర్వాత రాజ మందిరానికి వెళ్ళేటట్లు నిర్ణయించినారు. ఎంతో ఆనందంతో ఎదురుచూస్తున్న ఆ శుభగడియరాగానే సంగీత మహల్‌లో అడుగుపెట్టి గురువుగారికి గురువైన సుబ్బయ్యగారికి పాదాభివందనం చేసి కచేరికి ఉపక్రమించాడు. ఆ రోజు త్యాగయ్య గానం చేసిన కీర్తన ఇది.

ప॥ మరిమరి నిన్నే మొరలిడ నీ మనసున దయరాదు ॥మ॥

అ॥ప॥ కరిమొరవిని సరగునచన నీకు గారణమేమి? సర్వాంతర్యామి ॥మ॥

చ॥ కరుణతో ధ్రువుని కెదుట నిల్చిన కథ విన్నానయ్య

సురరిపు తనయునికై నరమృగమౌ! సుచనమేలేమయ్యా?

మరచియున్న వనచరుని బ్రోచిన మహిమ దెలుపవయ్యా?

ధరను వెలయు త్యాగరాజ సన్నుత తరముగాదిక నేవిననయ్య ॥మ॥ (కాంభోజి- ఆది)

ఈ కీర్తన పూర్తి అయ్యేసరికి 8 గంటలు పట్టింది. రాచకార్యం మాటే మరచి గానం వింటూ ఉండిపోయారు. ఆ మర్నాడు రాజుగారి కొలువులో ఎవరినోట విన్నా ఆ పిల్లగాయకుణ్ణి ప్రశంసించడమే. ఆశ్చర్యంగా వింటున్న రాజుగారికి ఆస్థాన విద్వాంసులైన వెంకటసుబ్బయ్యగారు కూడా త్యాగరాజును మెచ్చుకొనేసరికి రాజుగారిక్కూడా ఆసక్తి కలిగి ఎలాగైనా తన కొలువుకు రప్పించి పాడించాలనే కోర్కెతో దూతలకు త్యాగయ్యను వచ్చేటప్పుడు తనను పొగుడుతూ రెండు కీర్తనలు తీసుకురమ్మని కబురు పెట్టారు. అలా రాసినందుకు గాను ధనకనక వస్తు వాహనాలను ఇస్తామని ధనాశ చూపగా త్యాగయ్య మనస్సు చివుక్కుమనిపించి రాజధూతలకు భావోద్రేకంతో వ్యంగ్య విలసితంగా సంగీతపరంగా ఇలా సమాధానం చెప్పారు.

నిధి చాలా సుఖమా? రాముని స
న్నిధి సేవ సుఖమా? నిజముగ బల్కు మనసా ॥నిధి॥
దధి నవనీతక్షీరములు రుచియా? దాశ
రధి ధ్యాన భజన సుధారసము రుచియా? ॥నిధి॥
దమ శమమను గంగాస్నానము సుఖమా? క
ర్దమ దుర్విషయ కూపస్నానము సుఖమా? ॥నిధి॥
మమత బంధన యుత నరస్తుతి సుఖమా?
సుమతి త్యాగరాజనుతుని కీర్తన సుఖమా? ॥నిధి॥ (కళ్యాణి-ఆది)

ఈ తిరస్కార పరంపరలతో దూతలు తిరిగి వచ్చేసరికి మహారాజు అవమానాన్ని సహించక త్యాగయ్యను బంధించి తెమ్మని ఇద్దరు సేనానులను పంపించారు. వారు అలా వెళ్ళగానే రాజుకు ఉదరబాధ తీవ్రంగా వచ్చింది. రాజవైద్యులు ఎంత చికిత్స చేసినా తగ్గలేదు. ఇంతలో ఆస్థానంలోకి మాంత్రికులు ప్రవేశించారు. ఆయన అసలు సంగతి పసిగట్టి ఒక మహాభక్తుడి పట్ల చేసిన అపచారమేనని చెప్పగానే







రాజు సిగ్గుతో తలబట్టుకుని ఇద్దరు సేనానులను త్యాగయ్యను విడిచిపెట్టమని పంపించగా వారు వెళ్ళి మార్గమధ్యములోనే అడ్డుకుని నలుగురు సేనానులు తంజావూరు వచ్చేసరికి రాజు కులాసాగా కనిపించారు. ఇది జరిగిన కొంతకాలం తర్వాత స్వయంగా రాజే త్యాగయ్యను కలుసుకుని తన అపరాధాన్ని మన్నింపమని కోరగా సహృదయంతో వారు మన్నించారు.

త్యాగయ్య పధ్నాలుగో యేట తండ్రి కాలం చేశారు. అన్నగారైన రామనాధయ్యకూడా అకాలమృత్యువాత పడినాడు. తల్లి సీతమ్మ, తమ్ముడు త్యాగయ్యల పోషణాభారం పంచాపకేశయ్యపై పడేసరికి ఏం చేయాలో తోచక తమ్ముడిమీద కోపాన్ని శ్రీరామచంద్రునిపై చూపాడు. తన ఆరోప్రాణంగా చూసుకొనే విగ్రహాన్ని కావేరినదిలో పడవేశాడు. బయటికి వెళ్ళిన త్యాగయ్య ఇంటికివచ్చి పూజగదిలోకి రాగానే దైవం కనిపించక ఇల్లంతా వెతికాడు. ఎక్కడా కనిపించకపోయేసరికి తల్లిని అడగగా జరిగిన విషయం చెప్పగానే తన దురదృష్టానికి కుమిలిపోతూ అన్నహారాలు మానేసి దిగులుతో కృశించి 'నేనెందుకు వెదుకుదురా? శ్రీహరీ' అంటూ రాముని విగ్రహం కోసం పరితపించసాగినాడు.

"ఎందు దాగినాడో? మాడకురా
నెన్నడు దయవచ్చునో? ఓ మనస (తోడి-చాపు)

అని తనలో తానే వితర్కించుకోసాగేడు. గురువుగారి దైన్యావస్థకు ఎంతగానో చింతించి ఆ విగ్రహం కోసం వారు కూడా ఎంతో గాలించారు. అయినా ప్రయోజనం లేకపోయింది. ఇలా వుండగా ఒకనాటి రాత్రివేళ కలలో విగ్రహం ఎక్కడ వున్నది సాక్షాత్తు శ్రీరాముడే విశదీకరించాడు. ఉదయాన్నే లేచి కావేరీ తీరానికి వెళ్ళి ఇసుకలో వెదికి చూడగా విగ్రహం దొరికింది. ఆ ఆనందంలో త్యాగయ్య నోటి నుండి ఈ కీర్తన వచ్చింది.

ప॥ కనుగొంటిని శ్రీరాముని నేడు ॥కను॥
అ.ప॥ ఇలలోన సీతానాయకుని నేడు ॥కను॥

చ॥ భరత లక్ష్మణ శత్రుఘ్నులు కొలువ
పవమానసుతుడు పాదములు బట్ట
ధీరులైన సుగ్రీవప్రముఖులు
వినుతిసేయ త్యాగరాయనుతుని నేడు ॥కను॥ (బిలహరి-దేశాది)

విగ్రహం దొరికిన వార్త తెలిసిన శిష్యులు పల్లకితో పరుగు పరుగున వెళ్ళి రాములవారిని ఊరేగించి తెస్తూ వుంటే త్యాగయ్య ఇలా పాట అందుకున్నారు.

ప॥ రారా! మా యింటిదాకా రఘు
వీరా! సుకుమారా! మ్రొక్కేరా ॥రారా॥

అ॥ప॥ రారా! దశరథ కుమారా!
నన్నేలుకోరా తాళలేరా ॥రారా॥

చ॥ కోరిన కోర్కెలు కొనసాగకనే
నీరజనయన! నీదారినిగని వే
సారితిగాని సాధుజనావన;
సారివెడలి సామినేడైన ॥రారా॥

చ॥ ప్రొద్దున లేచి పుణ్యముతోటి
బుద్ధులు చెప్పి బ్రోతువుగాని





సంగీత రత్నాకరము

ముద్దుగారు నీ మోమును జూచుచు
వద్ద నిలిచి వారము పూజించె ॥రారా॥

చ॥ దిక్కు నేననుచు దెలిసి నన్ను బ్రోవ
గ్రుక్కునరావు కరుణను నీచే
జిక్కియున్నదెల్ల మరతురా యిక
శ్రీ త్యాగరాజుని భాగ్యమా ॥రారా॥ (అసావేరి-దేశాది)

ఆ విధంగా స్వామి వారిని ఇంటికి తెచ్చి పూజ చేసుకున్నారు. ఇది జరిగిన కొన్నాళ్ళకు తల్లి చనిపోయారు. కొద్ది కాలానికి తన 18వ ఏట పార్వతమ్మ అనే కన్యతో వివాహం జరిగి గృహస్థాశ్రమాన్ని స్వీకరించాడు. ఇలా వుండగా ఒకరోజు రామకృష్ణయతీంద్రుడనే హరిదాసు కాంచీపురం నుండి వేంచేశారు. అర్ఘ్యపాద్యాదులతో అతిథిసేవ చేశాడు. భోజనానంతరం ప్రస్తావవశాన శ్రీరామషడక్షరీ మంత్రాన్ని 96కోట్లు జపం చెయ్యవలసినదిగా త్యాగయ్యకు సూచించారు యతీంద్రులవారు. అలా రోజుకు లక్షా పాతికవేలు రామమంత్రోపాసన చేసేవారు. కొంతకాలానికి భార్య కూడా జపం ప్రారంభించింది. ఆ పరమాత్ముని కృపవల్ల ఇరవైఒక్క సంవత్సరాలకే 96కోట్ల రామజపం పూర్తయింది. మధ్యలోనే భార్య పార్వతమ్మ అనారోగ్య కారణంగా మరణించింది. పిల్లలు లేకపోవటంతో పార్వతమ్మ చెల్లెలు కమలాంబను భార్యగా స్వీకరించవలసి వచ్చింది. ఆ దంపతులకు సీతాలక్ష్మి అనే కుమార్తె కలిగింది. ఆమెను అఖిలాండపురం కుప్పుస్వామయ్య అనే వరునికిచ్చి వివాహం చేశారు. కొన్నాళ్ళకు త్యాగయ్యకు ఒక మనుమడు కలిగాడు.

భారతీయ సంగీత చరిత్రలో త్యాగరాజుకు వున్నంత శిష్యపరంపర మరే వాగ్గేయకారునికి కూడా లేరు. త్యాగయ్య సంగీత సంపదకు వారసులుగా నిలిచిన వారిలో ముఖ్యులు వాలాజీపేట వెంకటరమణ భాగవతార్, వారి కుమారుడు కృష్ణస్వామి భాగవతార్, తంజావూరు రామారావు, వీణకుప్పయ్య వీరంతా ఎల్లప్పుడు త్యాగరాజును అంటిపెట్టుకొనే ఉండేవారట. తంజావూరు రామారావు పట్ల త్యాగయ్యకు

వాత్సల్యం మక్కువ. త్యాగయ్య కార్యక్రమాలన్నిటినీ ఆయనే సిద్ధం చేసేవాడు. అందుకే ఆయన్ని మిగిలిన శిష్యులు "చిన్న త్యాగరాజు" అని పిల్చేవారు. కులమతాల ప్రసక్తి లేకుండా గుణమే ప్రధానంగా భావించి శిష్యులను స్వీకరించి గురుదక్షిణ ఆశించకుండా తన అంతటి వాళ్ళను తీర్చిదిద్దిన మహనీయుడు. ఆయనకు ఏదో ఒక కానుక సమర్పించుకుందామనుకుంటుండగా కూతురి వివాహమహోత్సవం వచ్చింది.

అందరూ పోటీపడి కానుకలు తెచ్చారు. వాలాజీపేట వెంకటరమణ భాగవతార్ కాలినడకన తిరువైయూర్ నుండి పల్లవి ఎల్లయ్య చిత్రించిన కోదండరామస్వామి నిలువెత్తు పటాన్ని సమర్పించాడు. అది చూసిన ఆనందంలో త్యాగయ్య గానం జనసమ్మోహనమైంది.

ప॥ నన్ను పాలింప నడచి వచ్చితివో? నా ప్రాణనాథ! ॥న॥

అ॥ప॥ వనజ నయన మోమును జూచుటజీ
వనమని నెనరున మనసు మర్మము దెలిసి ॥న॥

చ॥ సురపతి నీలమణి నిభ తనువుతో
నురమున ముత్యపు సరుల చయముతో
కరమున శర కోదండ కాంతితో
ధరణి తనయతో, త్యాగరాజార్చిత ॥న॥

నేటికి కూడా కోదండరామస్వామి తిరువైయార్‌లో పూజలు అందుకుంటూనే ఉన్నాడు.

వయోవృద్ధులు కాంచీపురనివాసి అయిన శ్రీ ఉపనిషద్ బ్రహ్మంగారు త్యాగయ్య తండ్రికి సహపాఠి ఆప్తస్నేహితుడు కూడా. త్యాగయ్య పేరు ప్రతిష్ఠలు విని అతనిని చూడాలన్న కోర్కెతో కబురుపెట్టారు. బ్రహ్మంగారి మాటను జవదాటక కంచికి బయలుదేరారు. గురువుగారు కంచికి బయలుదేరిన సంగతి తెలుసుకుని శిష్యులు వారి వారి గ్రామాలకు కూడా ఆహ్వానించేసరికి చిరునవ్వుతో వారి కోర్కెను మన్నించాడు. అలా త్యాగయ్య సంగీత జైత్రయాత్ర తీర్థయాత్రగా ప్రారంభమైనది. ప్రతిగ్రామంలోను తన శిష్యులు వారికి చేతనైనట్లుగా గురువును







సత్కరించుకున్నారు. కంచిలో బ్రహ్మంగారి ఇంట మంచి ఆతిధ్యం లభించింది. కొన్నాళ్ళపాటు భజనలతో కంచి వరదుణ్ణి సేవించి ఆ స్వామిపై రెండు దివ్య నామ కీర్తనలు చెప్పాడు త్యాగయ్య. అనంతరం వాలాజీపేట మీదుగా తిరుపతి వైపుగా ప్రయాణం సాగిపోయింది. తిరుమల సేవించడం అదే ప్రథమం కావడంతో ఆయన మనస్సు సంతోష తరంగాలు ఎగసి భక్త్యావేశం, ఉత్కంఠ, ఉద్రేకాలు ముప్పిరిగొని కొండను చేరేసరికి అపరాహ్నం కావచ్చింది. వెంటనే పుష్కరిణికి వెళ్ళి స్నాన జపాదులు పూర్తిచేసి తదేక ధ్యానంతో ఆలయంలోకి పరుగులు తీశారు. దర్శన వేళ కాకపోవడంతో స్వామివారికి తనకూ మధ్య తెర వ్రేలాడుతూ కనిపించింది. తన తొందరపాటుకు చింతించి తనలోని అహంకారపు పొరలను తొలగించవలసిందిగా వినయవినమితగాత్రుడై ఏడుకొండల స్వామిని ఇలా వేడుకున్నాడు.

తెరతీయగరాదా? నా లోని ॥తె॥
తిరుపతి వేంకటరమణ మత్సరమను ॥తె॥
పరమపురుష! దర్మాదిమోక్షముల
బారదోలుచున్నది నాలోని ॥తె॥
మత్స్యము యాకలిగొని గాలముచె
మగ్నమైన రీతినున్నది
అచ్చమైన దీపసన్నిధిని మరు
గడ్డబడి చెరచినట్లున్నది ॥తె॥
ఇరవొందగ భుజియించు సమయమున
నీకు దగులు రీతినున్నది

హరిధ్యానము జేయువేళ చిత్తము
యంత్యజువాడకుబోయినట్టున్నది ॥తె॥
వాగురమని తెలియక మృగగణములు
వచ్చి తగులు రీతినున్నది
వేగమె నీమతము ననుసరించిన
త్యాగరాజునుత! మత్సరమను ॥తె॥

కీర్తన పూర్తికావడం తెర తొలగిపోవడం ఒకేసారి జరిగాయట, శ్రీ వేంకటేశ్వరుల దివ్యమంగళ విగ్రహం కన్నులపండుగగా సాక్షాత్కరించిన పరమానందంలో ఆయన గళంనుండి "వేంకటేశనిను సేవింపను అనే కీర్తన ఆలపించాడు. ఆ గానం విని అర్చకులు వచ్చి ఆలయ మర్యాదలతో స్వాగతం పలికారు. అనంతరం త్యాగయ్య షోళింగపుర పురమునకు వెళ్ళి ఆ క్షేత్రంలో వెలసిన శ్రీ యోగలక్ష్మీ నృసింహస్వామిపై 'నారసింహ నను బ్రోవవే', 'నరసింహమమపాహి' కృతులను పాడాడు. కంచి బ్రహ్మంగారి స్నేహితుడైన మొదలియార్ కోవూరులోని తన ఇంటికి ఆహ్వానించాడు. ఆయన ఆహ్వానాన్ని మన్నించి కోవూరులోని సుందరేశ్వరస్వామి (ఈశ్వరుడు) ఆలయం ఉంది. ఈయనపై 5 కీర్తనలు రాశాడు. వీటినే కోవూరు పంచరత్నాలంటారు.

1) శహనరాగంలో 'ఈవసుధనీవంటిదైవము'
2) ఖరహరప్రియరాగంలో 'కోరిసేవింపరారే'
3) పంతువరాళి రాగంలో 'శంభోమహదేవ'
4) కళ్యాణిరాగంలో 'నమ్మివచ్చిన నన్ను'
5) శంకరాభరణరాగంలో 'సుందరేశ్వరునిజూడ'

అక్కడ నుండి శ్రీరంగం వెళ్ళారు. అక్కడ ఉన్న రంగనాథుడిపై ఐదు కీర్తనలు రచించాడు.







1) తోడిరాగంలో 'రాజు వెడలె చూతము రారే'
2) కాంభోజిరాగంలో 'ఓ రంగశాయి'
3) దేవగాంధారి రాగంలో 'వినరాద నా మనవి'
4) ఆరభిరాగంలో 'చూతమురారే'
5) సారంగరాగంలో 'కరుణజూడవయ్య'

అనే కీర్తనలను శ్రీరంగ పంచరత్నాలు అంటారు.

ఈ విధంగా త్యాగయ్య కీర్తనలే కాకుండా 'ప్రహ్లాద భక్తి విజయం' 'నౌకాచరిత్రం', 'సీతారామ విజయం' అనే సంగీత నాటకాలు కూడా రచించాడు. మనం నాట, గౌళ, వరాళి, ఆరభి, శ్రీరాగాలని ఘనరాగాలంటాము. వీటినే ఘనరాగపంచరత్నాలని కూడా అంటారు.

1) 'జగదానంద కారకా' నాటరాగం (ఆది)
2) 'దుడుకుగల నన్నే దొరకొడుకుబ్రోచురా' గౌళ (ఆది)
3) 'సాధించెనే ఓ మనసా' ఆరభిరాగం (ఆది)
4) 'కనకనరుచిరా' వరాళిరాగం (ఆది)
5) 'ఎందరో మహానుభావులు' శ్రీరాగం (ఆది)

త్యాగయ్య 72 మేళకర్త రాగాల్లోనూ కృతులు రాశాడు. కొన్ని అపురూప రాగాలలో కూడా కృతులు రాశాడు. అపురూప రాగాలు అంటే ఎక్కడో మారుమూల ఉన్న సంగీత గ్రంథాలలలోనివి త్యాగయ్య 200 రాగాలు ఉపయోగించాడు తన కృతుల్లో. ఇన్ని రాగాలు వాడిన వాగ్గేయకారుడు త్యాగయ్య ఒక్కడే.

కోవూరు నుండి తిరువైయ్యూరుకు భారమైన హృదయంతో త్యాగయ్య వెడుతుండగా శ్రీరామనవమి ఉత్సవాలకు, వైకుంఠ ఏకాదశి, భజనలకు ఉపయోగించుకోమని శిష్యులకి చెప్పి వెయ్యి వరహాలను పల్లకిలో పెట్టించాడు. అలా బయలుదేరిన పల్లకి ఒక అరణ్యం మధ్యలోకి వచ్చింది. హఠాత్తుగా కొందరు దుండగులు వెంటపడ్డారు. శిష్యులు కంగారుపడి త్యాగయ్యకు చెప్పారు. ఆయన మన దగ్గర ఏముందని వారు తీసుకుంటారు. అంటూ నిర్లిప్తంగా జవాబు చెప్పేసరికి మొదలియార్‌గారు ఇచ్చిన వెయ్యివరహాల సంగతి అప్పుడు చెప్పారు. అప్పుడు త్యాగయ్య "అది దేవుని సొత్తు అయితే దేవుడే దానికి దిక్కు'' అంటూ ధ్యానసమాధిలోకి వెళ్ళిన త్యాగయ్యకు ఒక కీర్తన ప్రతిధ్వనించింది.

ముందు వెనుక యిరుప్రక్కలతోడై
ముర ఖర హర! రారా! ॥ముం॥
ఎందుగాన నీ యందమువలె, రఘు
నందన వేగమె రారా! ॥ముం॥
చండభాస్కరకులాబ్ధి చంద్రకో
దండపాణియై రారా!
అండగొలుచు సౌమిత్రి సహితుడై
అమిత పరాక్రమ రారా! ॥ముం॥
ఓ గజరక్షక! ఓ రాజకుమార! ఓం కారసదన! రారా!
భాగవతప్రియ! బాగబ్రోవవయ్య!
త్యాగరాజనుత! రారా! ॥ముం॥ (దర్బారు-ఆది)







ఆ గానం పూర్తయ్యేసరికి ఇద్దరు యుద్ధవీరులు ప్రత్యక్షమై శరపరంపర కురిపించేసరికి దొంగలు పారిపోయారు. తరువాత వారు వచ్చి దొంగలు వెళ్ళిపోయారు అని చెప్పి అంతర్థానమైపోయారు. తెల్లవారేసరికి వారి పల్లకి ఒక గ్రామంలోని సత్రానికి చేరుకున్నారు. ఇంతలో దొంగలు వెదుక్కుంటూ వచ్చి తమపై బాణాలు కురిపించినవారెవరు అని అడిగేసరికి త్యాగయ్య తెల్లబోయి "ఇంకెవరు బాబూ ఆ రామలక్ష్మణులుగాక'' అంటూ తన అదృష్టానికి మురిసిపోయి తనివితీరా ఇలా పాడుకున్నారు.

ఎంతభాగ్యము మాపాలగల్గితివి
ఎవ్వరీడు? ముజ్జగములలోతన ॥ఎం॥
చెంతజేరి సౌజన్యుడై బలికి
చింతబాగ తొలగించి బ్రోచితి ॥ఎం॥
మున్ను నీ సమీపమున వెలయు స
న్మునుల నెల్ల నణిమాది లీలలచే
దిన్నగాను బాలనము జేసినట్టు
నన్ను గాచితివి త్యాగరాజనుత! ॥ఎం॥

ఆ దివ్య పురుషుల్ని దర్శించగల్గిన ఆ దొంగల భాగ్యాన్ని కొనియాడి వారికి తారకనామం మంత్రోపదేశం చేశారు. వారు దొంగతనాలు మానేసి మంచి మార్గానికి మరలారు. ఇలా త్యాగయ్య గొప్పదనం చెప్పుకోవడానికి ఒకటా రెండా ఇలా ఎన్నో ఉదాహరణలు చెప్పుకోవచ్చు. త్యాగయ్య తన కృతుల్లో సమాజంలో చెడును విమర్శిస్తాడు. భగవంతుణ్ణి చేరేందుకు మనం ఎలా జీవించాలో తెలుపుతాడు. ఎలా పూజించాలో చెపుతాడు. సంగీతాన్ని పొగుడుతూ కొన్ని కీర్తనలు కూడా రాశాడు. కొన్ని కీర్తనల్లో తనలో ఉన్నలోపాల్ని, తను చేసిన పాపాల్ని క్షమించమని తనని రక్షించమని వేడుకుంటాడు. ఇలా త్యాగయ్య కీర్తనల్లో ఎన్నో ఎన్నెన్నో భావాలు ఉంటాయి.

త్యాగయ్య ధర్మపత్ని కమలాంబ 1845 సం॥ చనిపోయింది. ఆ వృద్ధాప్యంలో భార్యా వియోగం తట్టుకోలేక తన ఇహలోక యాత్ర చాలించాలని వేడుకొంటూండేవాడు. ఇది జరిగిన కొంతకాలానికి స్వప్నంలో జానకీరాముడు దర్శనమిచ్చి నీకు పునర్జన్మ కలదని చెప్పగా "ఇంతకాలం మిమ్మల్ని సేవించింది పునర్జన్మ ఎత్తడానికా?" అని దీనంగా ప్రశ్నించేసరికి ఆ కౌసల్యా తనయుడు కనికరించి మరునాడు సన్యాసాశ్రమం తీసుకో! ఆ మరుసటి రోజు నిన్ను నాలో ఐక్యం చేసుకుంటానని చెప్పి అంతర్ధానమయ్యాడు.

1847 సం॥ పుష్యబహుళ చతుర్థినాడు విద్వాంసులు, సాధువులు, శిష్యబృందం సమక్షంలో పరమహంస బ్రహ్మానందేంద్రస్వామి ద్వారా సన్యాసాశ్రమ దీక్ష స్వీకరించారు. ఆ నాడే 'నాదబ్రహ్మానంద! అని వారికి నామకరణం జరిగింది. త్యాగయ్య "రేపటి దినం పన్నెండు గంటలకు స్వామి సన్నిధి చేరబోతున్నానని" అక్కడ గుమిగూడిన జనంతో చెప్పారు. అంతే త్యాగరాజు ఇచ్ఛామరణం పొందనున్న అద్భుతాన్ని తిలకించడానికి సహస్రసంఖ్యలో వేంచేశారు.

సిద్ధిపొందే నాటి ఉదయం కూడా 'శ్యామసుందరాంగ' అనే కీర్తన కట్టారు. మరణించేనాటికి కుమార్తె సీతాలక్ష్మి, అల్లుడు కుప్పుస్వామయ్య త్యాగయ్య చెంతనే ఉన్నారు. వీరికి ఒక పుత్రుడు. అతనికి త్యాగరాజు అనే పేరు పెట్టారు. తాతగారి వలె అతడు కూడా మధురగాయకుడనిపించుకున్నాడు. గురవమ్మ అనే కన్యతో వివాహమయింది.

ఆ తరువాత కొంతకాలానికే నిస్సంతుగా అతడు మరణించాడు. విధవరాలు గురవమ్మ త్యాగరాజు ఆరాధించిన శ్రీరామవిగ్రహంతో పుట్టినింటికి చేరుకుంది. తన కాలమంతా ఆ విగ్రహారాధనలోనే గడిపివేసి ఆమె కూడా ఇహలోకం విడిచివెళ్ళింది. దాంతో త్యాగయ్య వంశమే అంతరించిపోయింది. కాని వారి సంగీతానికి మాత్రం దేశమంతటా వారసులు ఆనాడే వెలిశారు. వాళ్ళంతా ఈనాడూ వున్నారు. రేపు కూడా వుంటారు. అందుకే లోకంలో త్యాగరాజు చిరంజీవి అయ్యాడు.

1847 సం॥జనవరి 6వ తేదీ "జానకీ కాంత స్మరణే" అని హారతి వెలిగించి అంజలి ఘటించిన కరాలతో ఆయన శ్రీరామవిగ్రహం ముందు మోకరిల్లిగా వారి ఆత్మ పరమాత్మలో లీనమైపోయింది.







**త్యాగరాజుచే రచింపబడిన గ్రంథములు :-**

1) భక్త విజయం
2) ప్రహ్లాద చరిత్ర
3) దివ్య నామావళి
4) రాగరత్నమాలిక
5) నౌకా చరిత్ర

## నారాయణ తీర్థులు

ఈయన క్రీ.శ 1780 ప్రాంతంలో కృష్ణాజిల్లా మంగళగిరి సమీపంలో ఉన్న 'కాజ' అనే ఊరిలో పుట్టాడు. ఆంధ్రబ్రాహ్మణోత్తములు. అసలు పేరు తల్లావర్జుల గోవిందశాస్త్రి. సంస్కృతం, తెలుగు, సంగీతం చిన్నతనంలోనే బాగా నేర్చుకున్నాడు. శ్రీకృష్ణలీలా తరంగిణిని 12 సర్గలలో వ్రాసిన పండితోత్తములు. ఒకసారి అత్తవారింటికి వెళ్ళడానికి కృష్ణానది ఈదసాగాడు. ఆ కృష్ణానదిలో కొట్టుకొని పోతుంటే మనస్సులో సన్యాసం తీసుకున్నాడు. అలా తీసుకున్నాక ఒడ్డుకు వచ్చి చేరాడు. ఈ విషయాన్ని భార్యకు చెప్పాడు. నిజంగానే సన్యాసం తీసుకున్నాడు. శివరామానంద తీర్థులుకి శిష్యుడు అయ్యాడు. దేశాటన చేశాడు. నారాయణ తీర్థులు అన్న పేరు ఈయనకు సన్యాసం తీసుకున్నాక వచ్చింది.

నారాయణ తీర్థులకి కడుపునొప్పి ఉండేదట. యాత్రలు చేస్తూ తమిళనాడులోని తంజావూరు జిల్లా నాదుక్కావేరి అను గ్రామంలో వినాయకుడి గుళ్ళో నిద్రపోయాడు. కలలో వైకుంఠేశ్వరుడు కనిపించి "రేపు ప్రాతః కాలమందు నీ అనుష్ఠానమైన తర్వాత రెండు వరాహాలు (పందులు) కనిపిస్తాయి. వాటితో వెళ్ళి అవి ఎక్కడకు వెళ్ళి ఆగుతాయో అక్కడే నీ కడుపు నొప్పి తగ్గుతుంది" అని చెప్పి అంతర్ధానమయ్యాడు. అలానే అతడు మరుసటి రోజు నిద్ర లేచేసరికి 2 వరాహాలు కనిపించాయి. వాటి కూడా వెళ్ళసాగాడు. అవి భూపతిరాజపురం అనే చోట, కడుంగాల్ అనే కాలువలోకి దూకి ఈదుకుంటూ గట్టున ఉన్న వేంకటరమణస్వామి గుడికి కొంతదూరం వెళ్ళి అక్కడ అదృశ్యం అయిపోయాయి.

వాటితోకూడా అక్కడికి వెళ్ళిన తీర్థులవారికి కడుపునొప్పి తగ్గిపోయింది. తీర్థులవారు అక్కడే నివాసం ఉండాలని నిశ్చయించుకున్నారు. అక్కడ లక్ష్మీనారాయణుల గుడి కట్టించారు. ఆ ప్రదేశమే 'వరాహూర్' అని పేరు గాంచినది.

నారాయణ తీర్థులు రచించినది 'కృష్ణలీలా తరంగిణి' అనే నాటకం సంస్కృతంలో ఉంది. ఇందులో ఉన్న పాటల్నే 'తరంగాలు' అంటారు. ఈ తరంగాలకి పల్లవి, అనుపల్లవి, చరణాలు ఉంటాయి. ఈ నాటకంలో కృష్ణుడు, రుక్మిణిల కథలున్నాయి. ఈయన రాసిన తరంగాలు 'ఏహిమోహందేహి' 'కలయయశోదే' 'కృష్ణంకలయసఖి'గోవిందఘటయా, 'గోవింద మిహగోపికానంద' 'శరణం భవకరుణాలయ' మొదలైనవి బాగా ప్రచారంలో ఉన్నవి.

నారాయణతీర్థులు చాలాకాలం వరాహూరులో ఉండిపోయి, 'కృష్ణలీలాతరంగిణి'ని అక్కడే పూర్తిచేశారు. ఎందరికో తరంగాలు నేర్పారు. చివరికి ఆ వూళ్ళోనే సిద్ధి పొందారు.

## రామదాసు

ఖమ్మంజిల్లా నేలకొండపల్లి అనే ఊళ్ళో కామాంబ, లింగన్న అనే భార్యాభర్తలు ఉండేవారు. వీరు ఆంధ్రబ్రాహ్మణోత్తములు. వీరికి క్రీ.శ 1620వ సం॥లో మగపిల్లాడు పుట్టాడు. ఆ అబ్బాయికి గోపన్న అని పేరు పెట్టారు. గోపన్నకు చిన్న వయస్సులోనే ఉపనయనం చేశారు. విద్యాభ్యాసం రఘునాథభట్యాచార్యులు అనే గురువు దగ్గర పూర్తిచేశాడు. సంగీతం, సంస్కృతం, తెలుగు భాషల్లో కూడా ప్రావీణ్యం పొందాడు. చిన్నప్పటి నుండి ఇతనికి రాముడంటే ఎంతో భక్తి. అందుకే ఇతనికి రామదాసు అనే పేరు వచ్చింది., రామదాసుకి కమలమ్మ అనే ఆమెతో పెండ్లి జరిగింది. పెండ్లి జరిగిన కొద్ది రోజులకే తల్లితండ్రులను కోల్పోయాడు రామదాసు. కబీరు గోపన్నకు తారకమంత్రం (రామమంత్రం) ఉపదేశించాడు. ఉపదేశం పొందిన వెంటనే రామదాసు 'తారకమంత్రము కోరిన దొరికెను' అనే కీర్తన రాశాడు.

గోల్కొండ తానీషా దగ్గర అక్కన్న, మాదన్న అని ఇద్దరు మంత్రులు ఉండేవారు. వాళ్ళు రామదాసుకి మేనమామలు. వాళ్ళ సహాయంతో భద్రాచలం తాలూకాకి తాసిల్దారుగా ఉద్యోగం సంపాదించి తన బాధ్యతలు సక్రమంగా నిర్వర్తిస్తూ పై అధికారుల మెప్పు పొందాడు.







ఉద్యోగంలో ఉన్నా రాముడిపై భక్తి వదలక సంతర్పణలు చేసేవాడు. ఇలాగే ఒకసారి బ్రాహ్మణులకు సంతర్పణ జరుగుతుండగా అన్నాన్ని ఒక పెద్ద గొయ్యిలో గంజి వార్చారు. ఆ గంజి ఉన్న గోతిలో పొరపాటున రామదాసు కొడుకు పడి మరణించాడు. కమలమ్మ కొడుకు మరణవార్త అందరికి తెలిస్తే భోజనాలు పాడైపోతాయని ఎవరికీ చెప్పలేదు. అంతా పూర్తి అయ్యాక రామదాసుకి చెప్పింది. చనిపోయిన పిల్లాడిని తీసుకుని రామదాసు భద్రాద్రిరాముల వారి ముందు ఉంచి 'ఎంతపని చేసితివి రామా' అనే కీర్తన పాడేసరికి చనిపోయిన కొడుకు తిరిగి బ్రతికాడు. అప్పటి నుండి గోపన్నను అందరూ రామదాసు అని పిలవడం మొదలుపెట్టారు.

రామదాసు శిస్తు తాలూకు 6 లక్షల వరహాల సొమ్ముతో భద్రాచలంలో రాములవారికి గుడి కట్టించి సీతా, రామ, లక్ష్మణులకు నగలను చేయించాడు. శిస్తు పంపకపోయేసరికి తానీషాకు కోపం వచ్చి రామదాసుకు జైలుశిక్ష విధించాడు. జైలులో బంధించి, భటులు ఎన్నో విధాలుగా బాధించారు.

ఆ బాధల్ని తట్టుకోలేక 'గరుడగమనరారానన్ను కరుణనేలుకోరా' 'నన్నుబ్రోవమని చెప్పవే' 'ఎవడబ్బసొమ్మని కులుకుతు తిరిగేవు రామచంద్ర' అని రాముణ్ణి తిట్టి మళ్ళీ 'దెబ్బల కోర్వక అబ్బా తిట్టితినయ్య రామచంద్రా' అని 12సం॥ బాధలు పడ్డాడు.

రామ,లక్ష్మణులు వచ్చి తానీషాకు సొమ్ము చెల్లించి, రామదాసుని జైలు నుండి విడిపించారు. తానీషా గౌరవాభిమానాలు పొంది తిరిగి భద్రాచలం వెళ్ళాడు రామదాసు. ప్రతి ఏటా జరిగే శ్రీరామనవమి కళ్యాణానికి తానీషా ఎన్నెన్నో బహుమతుల్ని పంపేవాడు. ఈ సంప్రదాయం ఇప్పటికీ మన రాష్ట్రప్రభుత్వం పాటిస్తోంది.

'పలుకే బంగారమాయెనా' 'అంతారామమయం' 'ఏ తీరుగనను దయజూచెదవో' 'ఏమయ్యారామ' 'ఇక్ష్వాకుతికులతిలక' అనే కీర్తనలు బాగా ప్రచారంలో ఉన్నాయి. రామదాసు కీర్తనలు ఎంతో భక్తి పూర్వకంగా ఉండి సంగీతం కన్నా సాహిత్యం, భక్తికే ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తాడు 'రామదాసు' ఈయన ముద్ర ప్రతి కీర్తనలోను వస్తుంది.

రామదాసు ఎన్నెన్నో కీర్తనలు రచించి ఆ రాముడిలో ఐక్యం అయ్యాడు.

## క్షేత్రయ్య

క్షేత్రయ్య అసలు పేరు వరదయ్య. కృష్ణాజిల్లాలో ఉన్న 'మొవ్వ'. అనే గ్రామంలో పుట్టాడు. ఇంటిపేరు కూడా 'మొవ్వ' ఆ వూళ్ళో వున్న వేణుగోపాలస్వామి గుడి చాలా ప్రఖ్యాతి చెందింది. చిన్నప్పటి నుండి క్షేత్రయ్యకు సంగీతం అంటే చాలా ఇష్టం. కూచిపూడిలో నాట్యం కూడా నేర్చుకున్నాడు. 'మోహనాంగి' అనే దేవదాసితో స్నేహం ఉండేది. ఆమె ప్రోత్సాహంతో మువ్వ గోపాలుడిపై 'శ్రీపతి సుతుబారికి' అన్న పదం మొదలుపెట్టి అనేక పదాలు రచించాడు. ఇలా ఈయన రచించిన వాటికి మోహనాంగి నృత్యం చేస్తూ ఉండేది. ఆ రోజుల్లో పాటలను పదాలు అనేవారు. అంటే కీర్తన అన్నా, పదం అన్నా ఒకటిగానే చూసేవారు. శృంగారసంబంధమైన సాహిత్యం ఉండి, నెమ్మదిగా పాడే పాటలనే పదాలు అంటున్నారు. ఈ పదాలలో సాహిత్యం, శృంగారంలా ఉన్నా, భక్తి అంతర్లీనంగా ఉంటుంది. పదాలకి పల్లవి, అనుపల్లవి, చరణాలు ఉంటాయి. అన్నమయ్య రాసిన శృంగార సంకీర్తనలు క్షేత్రయ్యకు ఆదర్శం అయ్యాయి.

క్షేత్రయ్య యాత్రలు చేశాడు, బెల్లంకొండలో 'అలిగితివెందుకో' అన్నపదం, భద్రాచలంలో రామదాసు మీద, శ్రీశైలం, పాలగిరి, ఇనగబారు, తిరుపతి, తిరుమల, శ్రీరంగం ఇలా ఎన్నో క్షేత్రాలు తిరిగి ప్రతి క్షేత్రంలోను ఉన్న ప్రతి దేవతలపైన పదాల్ని రచించాడు. ఈయన భద్రాచలం చేరినప్పుడు రామదాసు తాసీల్దారుగా ఉండడంవల్ల క్షేత్రయ్యను ఎంతో ఆదరించాడు. వీరు మధుర, తంజావూరు, గోల్కొండ, విజయనగర సంస్థానములయందు బహు సత్కారములను పొందిన మహాఘనుడు. తెలుగు పదములను వ్రాసి తరించి గోపాలుని దర్శనమందిన పుణ్యాత్ముడు.

నాలుగువేల పదములను వ్రాసినాడు. ఈయన ముద్ర 'మువ్వగోపాల' పదరచనలో అద్వితీయులు. శ్రీ విజయరాఘవనాయకుని కోర్కెపై శ్రీ విజయరాఘవ పంచరత్నములు రచించి శ్రీవారికి అంకితమిచ్చెను. జయదేవుడే నారాయణ తీర్థులగను వీరు అపరనారాయణ తీర్థులుగాను చెప్పుకొనుచుండేవారు. క్షేత్రయ్య రాజసన్మానాలు అందుకొని క్షేత్రాలన్ని తిరిగి ఎన్నెన్నో పదాలు రచించి 'మొవ్వ' చేరుకుని అక్కడే వేణుగోపాలస్వామిలో ఐక్యమయ్యాడు.







## ముత్తుస్వామి దీక్షితులు

నాదజ్యోతి కర్ణాటక సంగీత యుగ పురుషుడు సంగీత త్రిమూర్తులలో ఒకరైన శ్రీ ముత్తుస్వామి దీక్షితర్ దక్షిణ భారతమున తమిళనాట, కమలాపురము, అను తిరువారూరు పుణ్యక్షేత్రమున జన్మించిరి. తిరువారూరు నందుగల శ్రీ త్యాగరాజస్వామి (శివుడు) శ్రీ కమలాంబా ఆలయము ప్రసిద్ధములైనవి. ఈ దివ్య క్షేత్రమునందే సంగీత త్రిమూర్తులైన శ్రీ త్యాగరాజస్వామి, శ్రీ శ్యామశాస్త్రివారు, శ్రీ ముత్తుస్వామి దీక్షితర్ వారు ముగ్గురును సమకాలికులుగా జన్మించి యుగపురుషులుగా ప్రకాశించుచుండుట అత్యంత విశేషము.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారి వంశము సంగీత, సాహిత్యములకు ప్రసిద్ధి గాంచినది. మహా సంగీత విద్వాంసుడు, వాగ్గేయకారుడు, సంస్కృతాంధ్ర, భాషాపండితుడు శ్రీరామస్వామి దీక్షితులు తండ్రి, తల్లి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి పరమభక్తులైన సుబ్బమ్మగారు ఈమె పూజల వల్ల స్వామి వరము వల్ల ఆ పుణ్యదంపతులకు క్రీ.శ. 1775సం॥ శ్రీ ముత్తుస్వామి దీక్షితర్ జన్మించిరి. రామస్వామి కూడా వాగ్గేయకారుడే. 'హంసధ్వని' రాగాన్ని సృష్టించింది ఈయనే. వర్ణాలు, కీర్తనలు కూడా రచించారు. వైదీశ్వరన్ కోవెల అనే ఊళ్ళో వున్న బాలాంబిక దేవి దయ వల్ల దీక్షితులు తరువాత చిన్నస్వామి, బాలస్వామి, బాలాంబిక అనే బిడ్డలు కలిగినారు. ముత్తుస్వామి తండ్రిగారి వద్ద సంస్కృత కావ్యనాటక అలంకారములు, పురాణ ఇతిహాసములు. శ్రీ విద్యోపాసన, జ్యోతిషము మొదలైన ఆర్ష విద్యలను బాల్యమునందే కూలంకషముగా నేర్చి అసమాన పాండిత్యమును సంపాదించిరి. దీక్షితర్ చిన్నతనంలో ముత్తుకృష్ణ మొదలియార్ అనే జమీందారు రామస్వామి సంగీతం విని తన ఆస్థానంలో ఉండమన్నాడు. అందుకు ఒప్పుకొని తిరువారూరు నుంచి 'మణలి'కి మకాం మార్చాడు. కొంతకాలానికి మొదలియార్ చనిపోయాడు. కొడుకు వెంకటకృష్ణ మొదలియార్ రామస్వామిని ఆదరించాడు. ఆ రోజుల్లో ఇంగ్లీషు వాళ్ళు మన దేశంలోకి వచ్చి ఈస్ట్ఇండియా కంపెనీ ప్రభుత్వం నడుపుతూఉండేది. వెంకటకృష్ణ మొదలియార్ ఇంగ్లీషు వాళ్ళ దుబాసీ అవటం వల్ల తరచుగా మద్రాసు వెళ్ళేవాడు. ముత్తుస్వామి, చిన్నస్వామిని కూడా తనతో తీసుకువెళ్ళేవాడు. అక్కడ పాశ్చాత్య సంగీతం విని ఆ సంగీత రహస్యాల్ని కూడా దీక్షితార్ అర్థం చేసుకున్నాడు. తెలుగు డిక్షనరీ రాసిన 'బ్రౌన్'దొరతో కూడా పరిచయం ఏర్పడింది. ఆయన కోరికమీద కొన్ని ఇంగ్లీషు

పాటలకి సంస్కృత సాహిత్యాన్ని కూర్చాడు. పాశ్చాత్య సంగీతంలో వాడే వైలెన్ దీక్షితార్‌ను ఆకర్షించింది. బాలస్వామి వైలెన్‌పై కర్ణాటక సంగీతాన్ని వాయించడం మొదలుపెట్టాడు. ముత్తుస్వామి వీణవాయిస్తుంటే దాంతో సమానంగా వైలెన్ వాయించేవాడు. ఈ విధంగా వైలెన్ మన కర్ణాటక సంగీతంలోకి వచ్చింది.

ఒకరోజున చిదంబరనాథ యోగి అనే ఆయన దీక్షితార్ ఇంటికి వచ్చాడు. ఆయన రామస్వామి, ముత్తుస్వామి దీక్షితులకు గురువు. ఈయన దీక్షితార్‌ను తీసుకుని కాశీ వెళ్ళారు. కాశీలో ప్రతిరోజూ విశ్వేశ్వరుణ్ణి పూజించడం, ధ్యానం చేయడం, సంగీత సాధన చేయడం ఇలా 5,6 సంవత్సరాలు గడుస్తుండగా ఒకరోజున గంగానదిలో స్నానం కోసం దిగుతుంటే కాళ్ళకు ఏదో తగులుతుంది. అది ఏంటని చూస్తే వీణ దాన్ని గురువుగారికి చూపించాడు. గురువుగారు ఆశీర్వదించి వీణను తీసుకొమ్మన్నారు. కొద్దిరోజులకే యోగి మరణించాడు. దీక్షితార్ కాశీనుండి తిరిగివస్తూ 'తిరుత్తని' అనే ఊరు చేరాడు. అక్కడే ఉండి తనకి ఇష్టమైన సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి 40 రోజులు శ్రద్ధగా పూజ చేశాడు. 41వ రోజు ఒక బ్రాహ్మణుడు వచ్చి 'ముత్తుస్వామి నోరు తెరు' అన్నాడు. నోరు తెరిచేసరికి పటికబెల్లం నోటిలో వేసి మాయమైపోయాడు. ఆ వచ్చింది సుబ్రహ్మణ్యేశ్వరస్వామి. అంతే దీక్షితార్‌కు అప్రయత్నంగా 'శ్రీనాదాది గురుగుహోజయతి జయతి' అన్న కీర్తన రచించాడు.

గుహుడు అంటే సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కాబట్టి తన గురువు గుహుడే అని భావించి 'మానసగురు గుహరూపంభజారే', 'శ్రీగురుగుహదాసోహం', 'శ్రీగురుణాగురుగుహయ' ఇలా చాలా కీర్తనలు తిరుత్తనిలో రచించాడు. అక్కడ నుండి తిరుపతి వచ్చి శ్రీనివాసుడిపై 'శేషాచలనాయకం' 'కాళహస్తిలో శ్రీకాళహస్తీశ' కంచివెళ్ళి కామాక్షిపైన 'కంజదళాయతాక్షి' 'నీరజాక్షి కామాక్షి', అని అలాగే ఏకామ్రేశ్వరునిపై 'చింతయమాకంద' 'ఏకామ్రనాథం భజేహం' అనే కృతులు రచించాడు. కంచిలో ఉన్నపుడు కైలాసనాథస్వామిపై 'కైలాసనాథం' 'కైలాసనాథేనా' అని కీర్తనలు రచించాడు.

కంచిలో ఉపనిషద్బ్రహ్మేంద్ర సరస్వతి 'రామాష్టపది' అని జయదేవుడి గీతగోవిందం లాంటిది రచించాడు. ఈ రామాష్టపదికి దీక్షితార్ స్వరాల్ని కూర్చాడు. కంచిలో 4సం॥ ఉండి అక్కడ నుండి తిరువన్నామలై చేరి అరుణాచలేశ్వరుడిపై 'అరుణాచలనాథం స్మరామి' అని,







అక్కడ నుండి చిదంబరంలోని నటరాజస్వామిపై 'ఆనందనటప్రకాశం' అని, అక్కడ నుండి వైదీశ్వరన్ కోవెల్‌లోని దేవతలపై అనేక కీర్తనలు రచించి మయూరం అనే ఊరువెళ్ళి మయూరనాథస్వామిపైన ఎన్నో కీర్తనలు రచించారు. తిరువారూర్‌లోని త్యాగరాజేశ్వరుడిపై కీర్తనలు 'కమలాంబిక' అనే అమ్మవారిపైన వావరణ కీర్తనలు 11 రాశాడు. త్యాగరాజస్వామి ఆలయంలో 16 రకాల గణపతి విగ్రహాలు ఉన్నాయి. అన్ని విగ్రహాలపై 16 కీర్తనలు రచించాడు. తిరువారూరు దగ్గర కీవళూరులో 'అక్షయలింగస్వామి' అనే ఈశ్వరుడిగుడి ఉంది. ఆయనపై 'అక్షయలింగవిభో' అని, తొమ్మిది గ్రహాలపై కీర్తనలు అంటే వాటినే నవగ్రహ కీర్తనలు అంటారు.

ఇంకా మధురమీనాక్షిపైన, రామేశ్వరంలోని సుందర రాజస్వామిపైన, శబరిమలైలో అయ్యప్పస్వామిపైన, గురువాయూరులో ఉన్న కృష్ణుడిపైన కీర్తనలు రచించాడు. ఈయన రచించిన వాటిలో 'వాతాపిగణపతింభజే' అని 'హంసధ్వని భూషిత హేరంభం' అనే కీర్తనలు బాగా ప్రచారంలో వున్నాయి. అనేక యాత్రలు చేసి చివరకు 'ఎట్టయాపురం' అనే ఊరు చేరాడు. అక్కడ మార్గానికి అటు ఇటు పంటపొలాలు పచ్చగా లేవు. ఎండిపోయి, నేలంతా బీటలు తీసి వుంది. ఆ ప్రాంతంలో వానలేక కరువు తాండవిస్తోంది. ఆ ప్రాంత పరిస్థితిని గమనించిన దీక్షితార్ అప్పటికప్పుడే 'ఆనందామృతకర్షిణి అమృతవర్షిణి' అన్న కీర్తన రచించి పాడడం మొదలుపెట్టారు. కీర్తన పూర్తయింది. అంతే వెంటనే ఆ ప్రాంతమంతా మేఘాలతో నిండిపోయి, చాలా పెద్ద వర్షం కురిసింది. తన పాటతో వర్షం పడేలా చేసిన దీక్షితార్ ఎన్నో కీర్తనలు రచించి చివరకు ఎట్టయాపురంలో 1835వ సం॥లో మరణించారు.

## శ్యామశాస్త్రి

సంగీత త్రిమూర్తులలో మూడవవారైన శ్రీ శ్యామశాస్త్రి పూర్వీకులు ప్రకాశం జిల్లా కంభంలో ఉండేవారు. తమిళనాడుకి వలసపోయారు. తంజావూరు జిల్లాలో తిరువారూరు అనే గ్రామములో 1763 సం॥ చిత్రభాను నామ సం॥ మేష రవి కృత్తికా నక్షత్రమున ఏప్రియల్ 26న జన్మించాడు. గౌతమ గోత్రీకులు. తండ్రి విశ్వనాథ అయ్యర్ 'బంగారు కామాక్షీదేవి' విగ్రహం త్యాగరాజేశ్వరుని గుడిలో ఉంది. ఆ విగ్రహానికి శ్యామశాస్త్రి తండ్రి అర్చకుడు. కొంతకాలం తరువాత ఈ విగ్రహం తంజావూరు చేరటం వల్ల విశ్వనాథ అయ్యర్ కుటుంబం కూడా

తంజావూరు చేరింది. శ్యామశాస్త్రి సంస్కృతం, తెలుగు, తమిళభాషలో చిన్నతనంలోనే పాండిత్యం సంపాదించాడు. తన మేనమామ దగ్గర సంగీతం నేర్చుకొని చక్కగా పాడేవాడు.

శ్యామశాస్త్రి అసలు పేరు 'వేంకట సుబ్రహ్మణ్యం' తల్లితండ్రులు ముద్దుగా 'శ్యామకృష్ణ' అని పిలిచేవారు. క్రమేపీ శ్యామశాస్త్రిగా పేరు పొందాడు. 'శ్యామకృష్ణ' అన్న పేరును తన కీర్తనల్లో ముద్రగా వాడేవాడు.

ఒకరోజు కాశీ నుండి సంగీతస్వామి అనే సన్యాసి ఈయన ఇంటికి భిక్షకై వచ్చినపుడు శ్యామశాస్త్రి యొక్క భవిష్యత్తు చెప్పి తన శిష్యునిగా స్వీకరించి అపూర్వ రాగతాళ ప్రస్థారక్రమములను తెలిపి సంగీత రహస్యాలను, గ్రంథములను ఇచ్చి గొప్ప పండితుడు కావాలని దీవించాడు. ఆ కాలంలో పచ్చిమిరియం ఆదెప్పయ్య అనే సంగీత విద్వాంసుడి గానం రోజూ వినమని చెప్పి మరల కాశీ వెళ్ళిపోయెను. గురువు ఆజ్ఞను శిరసావహించి రోజూ క్రమం తప్పకుండా వింటూ ఉండేవాడు. భైరవి రాగంలో 'విరిబోణి' అన్న వర్ణాన్ని ఈయనే రచించాడు. అదెప్పయ్యగారి ఈ వర్ణం అప్పట్లో బాగా ప్రచారంలో ఉండేది. తండ్రి మరణించాక కామాక్షీదేవికి పూజారి అయ్యాడు. భక్తితో దేవిని పూజిస్తున్న సమయంలో కామాక్షీ దేవితో మాట్లాడుతూ ఎన్నో కృతులు రచించేవాడు. కృతులేకాకుండా, వర్ణాలు, స్వరజతులు కూడా రచించాడు. ఈయనకు ఆనంద భైరవియోగం, తాళాల్లో మిశ్రచాపు అంటే చాలా ఇష్టంగా కీర్తనలు రచించాడు. ఎక్కువ కృతులు తెలుగులోను, కొన్ని సంస్కృతంలోను, మరికొన్ని తమిళంలోను కూడా వున్నాయి. తాళం గురించి రాసిన గ్రంథం కూడా ఉన్నది. లయ విషయంలో శ్యామశాస్త్రి కీర్తనలు చాలా కష్టంగా వుంటాయి. వీటిని నేర్చుకోవడం కష్టంగా కూడా ఉంటుంది. శ్యామశాస్త్రి మధురలో ఉన్న మీనాక్షిపై 9 కృతులు రచించాడు.

1. సరోజదళనేత్రి- శంకరాభరణం -ఆది
2. దేవి మీననేత్రి- శంకరాభరణం-ఆది
3. మరివేరేగతి- ఆనందభైరవి- చాపు
4. నన్నుబ్రోవులలితా-లలిత-చాపు







5. మాయమ్మ- ఆహిరి-ఆది
6. దేవినీదు పదసారస-కాంభోజి-
7. మీనలోచనబ్రోవ-ధన్యాసి, ఈ ఏడు మాత్రమే బాగా ప్రచారంలో ఉన్నాయి.

తంజావూరు రాజ్యాన్ని 'శరభోజి' పాలిస్తూండేవారు. బొబ్బిలి కేశవయ్య సంగీత విద్వాంసుడు. తనతో పోటీ చేయమని విద్వాంసులందరిని పిలిచాడు. వారందరూ పోటీకి భయపడి శ్యామశాస్త్రి దగ్గరకు వెళ్ళి కేశవయ్యతో పోటీ చేయమని కోరారు. ఆ కోరికని మన్నించి కామాక్షీదేవి దగ్గరకు వెళ్ళి చింతామణి రాగంలో 'దేవీబ్రోవసమయమిదే' అనే కీర్తన అప్పటికప్పుడు రచించి పాడాడు. ఆ తరువాత కేశవయ్యతో పోటీకి దిగాడు. కేశవయ్య 'సింహనందన' అనే పల్లవిపాడి, తిరిగిపాడమన్నాడు. శ్యామశాస్త్రి ఆ పల్లవిని అవలీలగా పాడాడు. 'శరభనందన' అనే చాలా కష్టమైన తాళంలో పల్లవి పాడి కేశవయ్యను పాడమన్నాడు. కేశవయ్య ఆ పల్లవిని పాడలేక ఓడిపోయాడు. అందరూ కూడా శ్యామశాస్త్రిని సంగీత సామ్రాట్టు అని బిరుదును కూడా ఇచ్చారు. అలాగే అప్పుకుట్టి అనే సంగీత విద్వాంసుడు కూడా శ్యామశాస్త్రితో పోటీ చేసి ఓడిపోయాడు. అప్పుడు రాజు శ్యామశాస్త్రిని గౌరవించి అనేక బహుమతులు ఇచ్చి గౌరవించి సత్కరించాడు. శ్యామశాస్త్రికి జ్యోతిషంలో కూడా మంచి పాండిత్యం ఉండేది. ముఖం చూసి భవిష్యత్తు చెప్పేవాడు. శ్యామశాస్త్రికి పంజుశాస్త్రి, సుబ్బయ్యశాస్త్రి అను ఇద్దరు కొడుకులు ఉండేవారు. సుబ్బరాయశాస్త్రి మాత్రం తండ్రి దగ్గర సంగీతం నేర్చుకొని మంచి వాగ్గేయకారుడిగా పేరు పొందాడు. శ్యామశాస్త్రి శిష్యులలో దాసరి అనే నాగస్వర విద్వాంసుడు, కృష్ణయ్యర్ మైసూర్ ఆస్థాన విద్వాంసుడిగా పేరు పొందాడు. ఈయనకు అనుకూలవతియైన భార్య ఉండేది. ఆమె మరణించిన ఆరవదినమునందే అనగా ఫిబ్రవరి 6, 1827వ సం॥రం వ్యయసంవత్సర మకర మాస శుక్ల దశమి రోజున శ్యామశాస్త్రి సిద్ధి పొందాడు.

త్యాగరాజు, ముత్తుస్వామిదీక్షితులు, శ్యామశాస్త్రి ఈ ముగ్గురు వాగ్గేయకారుల వల్ల మన కర్ణాటక సంగీతం ఎంతో అభివృద్ధి చెందింది. ఈ ముగ్గురూ కూడా సమకాలికులు కావడం, ముగ్గురూ తిరువారూరులోనేపుట్టడం విశేషం, ఈ ముగ్గురూ వాగ్గేయకారుల్ని కలిపి కర్ణాటక సంగీత త్రిమూర్తులు లేదా కర్ణాటక సంగీత రత్నత్రయం అని పిలుస్తారు. ఈ ముగ్గురు వాగ్గేయకారులు చిరస్మరణీయులు.

## వీణకుప్పయ్యర్

క్రీ॥శ॥ 1798సం॥ మద్రాసు దగ్గర ఉన్న తిరువొత్తియూర్ లో సాంబమూర్తి దంపతులకు కుప్పయ్యర్ పుట్టాడు. వీరు తమిళ బ్రాహ్మణులు. ఈయన చాలా గొప్ప వీణ విద్వాంసుడు. కుప్పయ్యర్ తండ్రి దగ్గర సంగీతం నేర్చుకున్నాడు. తెలుగు, సంస్కృతం కూడా బాగా నేర్చుకున్నాడు. వీణ, ఫిడేలు (వైలెన్) బాగా వాయించేవాడు. బాగా పాడేవారు. ఇంకా సంగీతం నేర్చుకోవాలనే అభిలాషతో త్యాగయ్యగారి శిష్యుడుగా చేరి బాగా పేరు పొందాడు. 'కుప్పయ్యకు' నారాయణగౌళరాగం చాలా కష్టంగా ఉండేది. ఈ రాగాన్ని చాలా గొప్పగా పాడేవారు.అలాగే 'రీతిగౌళ' రాగం కూడా అద్భుతంగా పాడేవారు. ఈ రెండు రాగాలలో వర్ణాల్ని కూడా రచించాడు. 'కుప్పయ్యర్' వేణుగోపాలస్వామి భక్తుడు అందుకే ఆయన తన కీర్తనల్లో 'గోపాలదాస' అనే ముద్రను ఎక్కువగా వాడేవాడు. కుప్పయ్యకు గాన చక్రవర్తి అనే బిరుదు కూడా ఉండేది. సంగీతరత్నావళి, పల్లవి స్వరకల్పవల్లి అను 2 గ్రంథములు రచించారు. యాత్రలు చేస్తున్నప్పుడు త్యాగయ్య కుప్పయ్య ఇంటికి వచ్చి కొన్ని రోజులు ఉండి కీర్తనలు కూడా రచించాడు. 1856లో కుప్పయ్యర్ మైసూరు వెళ్ళాడు. అక్కడ చాముండేశ్వరిదేవిపై బేగడరాగంలో 'ఇంతపరాకేలనమ్మ' కృతి రాశాడు. తిరుపతిలోనే వేంకటేశ్వరస్వామిపై 5 కీర్తనలు, శ్రీకాళహస్తిలో ఈశ్వరుడిపై 5, తిరువత్తియూర్‌లో త్రిపురసుందరి అమ్మవారిపై 8 కృతులు రచించాడు. పాశ్చాత్య సంగీతంతో కూడా పరిచయం ఉన్నది. ఈయన రచించిన బిలహరి రాగవర్ణంలో కూడా పాశ్చాత్య సంగీత పోకడలు కనిపిస్తాయి.

కుప్పయ్యర్ వర్ణాలు, కృతులు, తిల్లానాలు, కూడా రచించాడు. ఈయన రచనలన్నీ తెలుగులోనే ఉంటాయి. కొన్ని మాత్రమే సంస్కృతంలో ఉంటాయి. వర్ణాలు రచించటంలో చాలా నిపుణుడు. ఈయన రచించిన వర్ణాలు విని త్యాగయ్య ఎంతో మెచ్చుకునేవాడు. ఈయన కృతులు త్యాగయ్య కృతుల్ని పోలి వుంటాయి. కుప్పయ్యర్ తిరువొత్తయూర్ వదలి మద్రాసులోనే ఉండేవాడు. ఈయన కొడుకు తిరువొత్తియూర్ త్యాగయ్యర్ కృషి వల్ల మద్రాసులో సంగీత సభలు చాలా స్థాపించబడ్డాయి. తన తండ్రి రచనల్ని త్యాగయ్యర్ ముద్రించాడు. ఈయనకు చాలా మంది శిష్యులు ఉండేవారు. కుప్పయ్యర్ తండ్రి గారికి తను వీణ వాయించవలె శివుడు (దైవము) వినవలెనని కోరిక బాగా ఉండేది. అది తీరకుండానే కాలం చేశారు. కుప్పయ్యర్ తిరువొత్తియూరులోనే 1860 సం॥లో మరణించారు.







## పట్నం సుబ్రహ్మణ్యయ్యర్

సుబ్రహ్మణ్యయ్యర్ 1845సం॥లో తంజావూరులో పుట్టాడు. తిరువైయూర్‌లో ఉన్న తన మేనమామ మేలట్టూర్ గణపతిశాస్త్రి దగ్గర సంగీతం నేర్చుకున్నాడు. తరువాత త్యాగయ్య శిష్యుడైన చావడి వెంకట సుబ్బయ్యర్ దగ్గర సంగీతం నేర్చుకున్నాడు. ఈయన ముద్ర 'వెంకటేశ' ఈయన కృతులు త్యాగయ్య కృతుల్ని పోలి ఉంటాయి. ఎక్కువగా బేగడ రాగం ఇష్టం ఉండడం వల్ల ఈయనను బేగడ సుబ్రహ్మణ్యయ్యర్ అని కూడా పిలుస్తారు. సుమారుగా 100 సంగీత రచనలు చేశాడు. కృతులు జావళీలు, తిల్లానాలు రాశాడు. తెలుగు, సంస్కృతం, తమిళంలో కూడా రచనలు చేశాడు. 108 తాళములలో, 128 అక్షరకాలములు గల సింహానందతాళమున పల్లవిని గూర్చి పాడిన మహాఘనుడు. తాళ జ్ఞానములో వీరికి సమకాలికులు ఆ రోజులలో లేరని చెప్పేవారు. మొదట తిరువైయూర్‌లో నివసించి తరువాత కొంతకాలానికి చెన్న పట్టణమున నివాసము ఏర్పరచుకోవడం వల్ల ఈయనకు పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ అనే పేరు వచ్చింది.

పూర్ణచంద్రిక, ఖరహరప్రియ, కన్నడగౌళ, శుద్ధసావేరి, బేగడ ఈయనకు ఇష్టమైన రాగాలు. తను రాసిన కీర్తనల్ని ముందు విద్వాంసులకి పాడి వినిపించి బాగున్నాయని వారు మెచ్చుకుంటేనే తన శిష్యులకు నేర్పేవాడు. శ్రీనివాసయ్యంగార్, మైసూర్ వాసుదేవాచార్య, టైగర్ వరదాచారి వంటి శిష్యులు ప్రఖ్యాతిగాంచిన వాగ్గేయకారులు. 'కదనకుతూహలం' అన్న రాగాన్ని సృష్టించి అందులో 'రఘువంశసుధాంబుధిచంద్ర' అన్న కీర్తన రచించారు. ఈ కీర్తన బాగా ప్రచారంలో ఉంది. 1902వ సం॥లో శ్రీపట్నం సుబ్రహ్మణ్యయ్యర్ కాలం చేశారు.

## సదాశివబ్రహ్మేంద్ర

సదాశివబ్రహ్మేంద్ర సన్యాసి. దిగంబరంగానే ఉండేవాడు. ఇల్లు ఉండేదికాదు. కావేరీనది తీరాలలో తిరుగుతూ, ఏది దొరికితే అది తింటుంటేవాడు. ఈయన తండ్రి మహదేవదీక్షితార్. కంచిలో ఉండే పరమశివేంద్ర సరస్వతి శిష్యుడు. ఈయన ముద్ర పరమహంస. కీర్తనల్ని సంస్కృతంలో రాశాడు. 'మానససంచరరే బ్రహ్మణి' అన్న కీర్తన ఈయన రాసినదే. శివమానసపూజ, ఆత్మ విద్యావిలాసమ్, బ్రహ్మసూత్ర ప్రవృత్తి అనే గ్రంథాలు రాశాడు. "బ్రూహిముకుందేతి, భజరేగోపాలం, స్మరవారంవారం, గాయతి వనమాలి, భజరేయదునాథం, పిబరే రామరసం, ప్రతివారం వారం, ఖేలతిమామాహృదయే" అనే కీర్తనలు బాగా ప్రచారంలో ఉన్నాయి. 1714వ సం॥లో కరూర్‌లో సిద్ధి పొందారు.

## స్వాతి తిరునాళ్

1813వ సం॥ ఏప్రియల్ 16న జన్మించారు. తల్లితండ్రులు 'రామశర్మ' అని పేరు కాని 'స్వాతి' నక్షత్రంలో పుట్టడం వల్ల ఈయన స్వాతితిరునాళ్‌గా ప్రసిద్ధి చెందాడు. లక్ష్మీబాయి, రాజరాజవర్మ తల్లితండ్రులు చిన్నతనంలోనే పోవడం వల్ల పినతల్లి పార్వతీబాయి పెంచింది. చిన్నతనంలోనే సంస్కృతం, మళయాళం, కన్నడ, తెలుగు, మరాఠీ భాషలు, కర్ణాటక, హిందూస్థానీ సంగీతాలు కూడా నేర్చుకున్నాడు. స్వాతి తిరునాళ్ చాలా మంది దేవుళ్ళపైన, దేవతలపైన, కృతులు రచించాడు. స్వరజతులు, వర్ణాలు, పదవర్ణాలు, పదాలు, జావళీలు, తిల్లానాలు, కూడా రచించాడు. హిందూస్థానీ సంగీతానికి సంబంధించిన సంగీత రచనల్ని చేసిన మొట్టమొదటి దక్షిణ భారత వాగ్గేయకారుడు. ఇవే కాకుండా కుచేలోపాఖ్యానం, అజామీళోపాఖ్యానం, అనే హరికథలు కూడా రచించాడు. తన రచనల్లో అబ్జనాభ, అంభోరుహనాభ, సరసిజనాభ, పంకజనాభ, జలరుహనాభ అనే చాలా రకాల ముద్రలు వాడాడు. "పద్మనాభ" అన్న ముద్ర ఎక్కువగా వాడాడు.

16వ ఏట నుండి కేరళ రాజ్యాన్ని ఏలడం ప్రారంభించాడు. ఎందరో సంగీత విద్వాంసుల్ని, భాషాపండితుల్ని, కవుల్ని, తన ఆస్థాన విద్వాంసులుగా నియమించాడు. అల్లావుద్దీన్ అనే హిందుస్థానీ సంగీత విద్వాంసుడు, వడివేలు, పొన్నయ్యపిళ్ళై, చిన్నయ్యపిళ్ళై, వేంకటాద్రి భాగవతార్, పరమేశ్వర భాగవతార్ లాంటి కర్ణాటక సంగీత విద్వాంసులు ఈయన ఆస్థానంలో ఉండేవారు. చారుకేసి రాగంలో 'కృపయాపాలశౌరే' కానడలో 'మామవసదాజననీ' కుంతలవరాళిలో 'భోగీంద్రశాయినం' అనే కృతులు ధనశ్రీ రాగంలో 'గీతదునికుతకతోం' అనే తిల్లానా బాగా ప్రచారంలో ఉన్నాయి.

నృత్యప్రదర్శనల్లో 'భావయామిరఘురామం'అనే కీర్తనలో రామాయణకథ అంతా వస్తుంది. ఇది కూడా బాగా ప్రచారంలో ఉంది. ఇది రాగమాలిక రాగం అంటే చాలా రాగాలలో ఉంటుంది. పల్లవి ఒకరాగం, ఒక్కొక్క చరణం ఒక్కొక్క రాగంలో ఉంటాయి. అందుకే దీనిని రాగమాలిక అంటారు. స్వాతితిరునాళ్ 1846 డిసెంబరు 25న మరణించాడు. మరణించేనాటికి ఈయన వయస్సు 33 సం॥లు. ఇంత చిన్న వయస్సులో మరణించడం మన సంగీత రంగానికి తీరనిలోటుగా చెప్పుకోవచ్చు.





## రామనాధపురం శ్రీనివాసయ్యంగార్

1860వ సం॥లో పాపానకుళంలో పుట్టారు. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ శిష్యులు. ఈయనకు పూచి అయ్యంగార్ అని పేరు కూడా ఉంది. అయ్యంగారి శిష్యుడు శ్రీ అరియకుడి రామానుజయ్యంగార్. సుబ్రహ్మణ్యయ్యర్‌గారి వద్ద చిన్నప్పటినుండి సంగీతం బాగా నేర్చుకుని, పెద్ద విద్వాంసుల కచేరీలు వింటుండేవారు. ఈయన రామనాధపుర ఆస్థాన విద్వాంసులుగా ఉండేవారు. 'శ్రీనివాస' ఈయన ముద్ర. కృతులు వర్ణాలు జావళీలు, తిల్లానాలు రచించారు. మోహన, కానడ, తోడి, ఆనందభైరవి, శుద్ధసావేరి, పూర్వికళ్యాణి, దేవమనోహరి, కేదారగౌళ, మధ్యమావతి, బేహాగ్, ఖమాస్ రాగాలలో ఎక్కువగా రచనలు చేశారు. 'లక్ష్మీశత' అనే అపురూపమైన తాళంలో తిల్లాన రచించారు.

అయ్యంగార్ వర్ణాలలో మోహనరాగంలో 'నిన్నుకోరి' కానడ రాగంలో 'నెరనమ్మితినయ్య' ఇంకా కీర్తనల్లో శుద్ధసావేరీ 'సామజవరదా' పూర్వికళ్యాణి 'పరమపావనరామ' దేవమనోహరి 'నీకేలనాయడ నిశ్చలము' బేగడ 'అను దినమును గావుమయ్య' బేహాగ్ 'నిరుపమానసామినినా' సురటి 'వేగనీవువానిరమ్మనవే' చాలా ప్రచారంలో వున్నాయి. అయ్యంగార్‌కి ఒకసారి అరటితొక్కపైకాలుపడి జారి కాలు విరిగింది. వైద్యులు వైద్యం చేయలేకపోయారు. అప్పుడు ఆయన కేదారగౌళరాగంలో 'సరగున పాలింప' అనే కీర్తన రచించి పాడేసరికి కాలు నయం అయ్యింది. అయ్యంగార్ 1919వ సం॥లొ మరణించారు.

## మైసూర్ వాసుదేవాచార్య

వాసుదేవాచార్య 1865 సం॥లో పుట్టాడు. తండ్రి సుబ్రహ్మణ్యాచార్య మైసూరు రాజాస్థానంలో పురాణం చెప్పే విద్వాంసుడు. తండ్రి చిన్నతనంలోనే మరణించడం వల్ల తన తాత గోపాలాచార్య దగ్గర పెరిగాడు. ఈయన గొప్ప సంస్కృత పండితుడు. వాసుసంగీతం, సంస్కృతం నేర్చుకున్నాడు. సంగీతం, వీణపద్మనాభయ్య దగ్గరనేర్చుకొని తరువాత పట్నం సుబ్రహ్మణ్యఅయ్యర్ దగ్గర నేర్చుకున్నాడు. "బ్రోచేవారెవరురా" అనే ఖమాస్ రాగకీర్తన ఈయన రచించినదే.

ఈయన 200 రచనలు చేశాడు. కొన్ని తెలుగులోను, కొన్ని సంస్కృతంలోను చేశాడు. ఆయన రచనల్ని ఆయనే ప్రచురించారు. వందరాగాలు వాడారు, వర్ణాల్ని, కీర్తనల్ని, తిల్లానాల్ని కూడా రచించారు. "అభినవత్యాగరాజు" అని అంతా పొగిడేవారు శిష్యులకు, ఎంతో సహనంతో, శ్రద్ధతో విద్య చెప్పేవాడు. శిష్యుల్ని స్నేహితుల్లా చూసేవాడు. ప్రతి శుక్రవారం తన ఇంట్లో భజనలో శహనరాగాన్ని అద్భుతంగా గంటన్నరసేపు గానం చేశాడు. వాసుదేవాచార్యకు 'సంగీతశాస్త్రరత్న' సంగీత సాహిత్య విద్వన్ మణి "సంగీత కళాకోవిద' మద్రాస్ మ్యూజిక్ అకాడమి 'సంగీత కళానిధి' భారత ప్రభుత్వం 'పద్మభూషణ' అవార్డులను ఇచ్చి ఎంతో ఘనంగా సత్కరించారు. 1961వ సం॥లో వాసుదేవాచార్య పరమపదించారు.

## మునిపల్లె సుబ్రహ్మణ్య కవి

కృష్ణాజిల్లాలో ఉన్న మునిపల్లెలో 1730 సం॥లో పుట్టాడు. ఈయన 104 కీర్తనలు రచించాడు. ఈయన కీర్తనల్ని ఆధ్యాత్మరామాయణ కీర్తనలు అంటారు. సావేరి, శుద్ధసావేరి, కళ్యాణి, మోహన, కేదారగౌళ, ముఖారి, సౌరాష్ట్ర, ఆనందభైరవి, నాటలాంటి ప్రసిద్ధరాగాలలో కూడా ఈయన కీర్తనలు ఉన్నాయి. రామాయణ కథని కీర్తనల రూపంలో రాసిన వాగ్గేయకారుడు మునిపల్లె సుబ్రహ్మణ్యకవి 1780వ సం॥లో మరణించారు.

## హరికేశనల్లూర్ ముత్తయ్య భాగవతార్

ముత్తయ్య తండ్రి లింగం అయ్యర్ తల్లి ఆనందమ్మాళ్. పూనల్‌వెల్లి అనే ఊరిలో 1877వ సం॥లో జన్మించారు. ఆరేళ్ళ వయస్సులో తండ్రి మరణించడం వల్ల మేనమామ లక్ష్మణసూరి ముత్తయ్యను చేరదీసి పెంచాడు. సాంబశివయ్యర్ దగ్గర సంగీతం నేర్చుకున్నాడు. తిరువాన్‌కూర్ మహారాజా ఆస్థానంలోను, ఎట్టయాపురం జమీందారుల దగ్గర కూడా కచేరీలు చేసి సన్మానాలు పొందాడు. "గాయకశిరోమణి" 'సంగీతకళానిధి' అనే బిరుదులు కూడా పొందాడు. మైసూరులో ఉన్న చాముండేశ్వరీదేవిపైన, శివుడిపైన కీర్తనలు రచించాడు. 400 దాకా కృతులు రాశాడు. కీర్తనలే కాక, వర్ణాలు, రాగమాలికలు రాశాడు. మద్రాసులో మ్యూజిక్ అకాడమీని స్థాపించిన వారిలో భాగవతార్ ఒకడు.







ఈయన ముద్ర 'హరికేశ' ప్రచారంలో ఉన్న రాగాలే కాకుండా కొన్ని అపురూప రాగాల్లో కూడా కృతులు రాశాడు. "హంసానంది" అనే రాగం హిందుస్థానీది. దీనిని మన కర్ణాటక సంగీతంలోకి తీసుకొచ్చింది మాత్రం ముత్తయ్యభాగవతార్. ఈ రాగంలో 'నీదుమహిమపొగడ" అనే కీర్తన రాశాడు. మోహన, కళ్యాణి, వలజిగౌడమల్హారు రాగాలలో కీర్తనలు రచించాడు.

ఈరాగాలు బాగా ప్రచారంలోకి వచ్చేందుకు కృషి చేశాడు. 20కి పైగా కొత్త రాగాలు కనుగొని ఈ రాగాల్లో కూడా కీర్తనలు రచించాడు. పశుపతిప్రియ, బుధమనోహరి, విజయనాగరి, కర్ణరంజని ఇవి ఈయన కనుగొన్న కొన్ని కొత్త రాగాలు. తెలుగు, సంస్కృతం, తమిళం, కన్నడ భాషలలో కీర్తనలు రచించాడు.

## శ్రీ శారదేవులు

వీరు కాశ్మీర దేశస్థులు. యాదవకులస్తులు. భాస్కరుని మనుమడు. సొడ్డల దేవుని కుమారుడు. వర్షగణ ఋషిగోత్రీకుడు. "దౌలతబాద్" అను దేవగిరి పట్టణమున క్రీ.శ. 1210 మొదలుకొని 1247సం॥ ల వరకు రాచరికము చేసిన వాడైన సిహ్మణ రాజు కాలములోనుండినవారు. సంస్కృతమందును, సంగీతమందును విశేషపాండిత్యము కలవారు. "ఆధ్యాత్మవివేక" మను ఒక వేదాంతగ్రంథము రచించి యుండిరి. మరియు 1. సర్వగతాధ్యాయము. 2. రాగవివేకాధ్యాయము 3. ప్రకీర్ణకాధ్యాయము 4. ప్రబంధాధ్యాయము 5. తాళాధ్యాయము 6. వాద్యాధ్యాయము 7. నృత్యాధ్యాయము అను ఏడు అధ్యాయాలుగా చెప్పబడిన సంగీత రత్నాకరమను గొప్ప గ్రంథమును రచించినారు. ఈయనకు 'శిశ్శంకుడు' అనెడి బిరుదు కలదు.

## సోమనాథ పండితుడు

వీరు ముద్గలసూరి పుత్రులు. త్త్రైలింగ్యద్విజులు. సంగీత సంస్కృతములయందు మహాప్రజ్ఞకలవారు. వీరు గీర్వాణ భాషయందు 'రాగవిబోధమ' అను లక్షణ గ్రంథము రచించెను. వీరి నివాసస్థలము. గోదావరీ మండలము, సుమారుగ వీరు మూడు వందల ముప్పయి సంవత్సరము నాటి వారని తెలియుచున్నది.

## గురుమూర్తి శాస్త్రులు

వీరు త్రైలింగ్య బ్రాహ్మణోత్తములు. మురికినాటివారు. తిరునల్వేలి జిల్లా కయత్తారు గ్రామ నివాసులు. చతుశ్శాస్త్రప్రజ్ఞులు. సంగీతమందు మిక్కిలి ప్రవీణులు. పణలి చిన్నయామొదలియారిచే ఆదరింపబడిన యశోవంతుడు. ప్రబంధ గీత రచన నేర్పరి. వీరిచే రచింపబడిన లక్షణ గీతము లిప్పటికిని బహుప్రశస్తముగానున్నవి. ఈయన కూడా 194 సం॥ క్రిందటి వారని తెలియుచున్నది.

## వెంకటమఖి

గోవింద దీక్షితులవారి ద్వితీయపుత్రులు వెంకటేశ్వర దీక్షితులను పేరు కలవారు. వారే వెంకటమఖి. అన్నగారైన యజ్ఞనారాయణ దీక్షితుల వారి శిష్యుడు. టుప్పికావ్యాఖ్యానమైన వార్తికాభరణమును (మీమాంసశాస్త్రము) రచించిరి. ఉత్తరదేశము నుండి వచ్చిన వాగ్గేయకారకులలో గొప్పవారైన తానప్పాచార్యుల వద్ద తన తండ్రి ఇష్టముచే శిష్యుడై లక్షణ లక్ష్యములతో సంగీత శాస్త్రమును అనురాగంతో నేర్చుకొని తన గురువుగారి మీద అరభిరాగమందు "గంధర్వజనతా ఖర్వదుర్వారగర్వభంజనురే" అను గీతమును ప్రథమంగా రచించి తమ తండ్రి, అన్న గురువుల వద్ద చదివి వినిపించెను. వారందరూ ఎంతగానో మెచ్చుకొనిరి. వెంకటమఖి వీణ, శృతి, స్వర, మేళ, రాగ ఆలాప, ఠాయ, గీత ప్రభంధ, తాళములనెడు పది ప్రకరణములతో కూడిన "చతుర్దండిప్రకాశిక" అను సంగీత లక్షణ గ్రంథమును విజయరాఘవ భూపాలుని ప్రేరణ వలన రచించెను. ఇందు రాగాంగ, ఉపాంగ, భాషాంగ రాగములకు శ్లోకరూపకముగా లక్షణములును, గీతరూపకముగా లక్ష్యములను వ్రాసియున్నారు. శ్రీ జయదేవులు వ్రాసిన అష్టపది గీత గోవిందవలె శ్రీ త్యాగరాజ విషయమై యీ వెంకటమఖియే ఇరవై నాలుగు అష్టపదులు వ్రాసినట్లు తెలియుచున్నది. వీరు సేతుయాత్ర వెళ్ళునపుడు దారిలో దొంగలు కొట్టిరి. అపుడు లలితరాగమున "అరెనిబిడకంటకదుష్ప్రదేశ" అను గీతమును పాడిన వెంటనే శ్రీరామలక్ష్మణులు దండపాణులై వచ్చి ఆ దొంగలను తరిమినారట.

విజయరాఘవ భూపాలుడు తన దేశస్తులందరు శంఖచక్రముద్రాంకితులై యుండవలెనని దండోరా వేయించి కాసేపటికి ఉదరబాధతో ప్రాణము విలవిల్లాడెను. ఎందరు వైద్యం చేసినను తగ్గక పోయేసరికి వెంకటమఖిని ప్రార్థించగా ఆయన మధ్యార్జున క్షేత్రమున యుండు







మహాలింగమూర్తిని ప్రార్థించి "శంఖచక్రాంకనత్యాచరరే" అను రీతి గౌళరాగంలో గీతమును పాడి పూర్తిచేయగానే రాజునకు ఉదరబాధ తీరి సుఖముగా నుండెనట. యీ విధంగా వీరి మహిమలు అనేకం కలవు. యిప్పటికి సుమారు 280 సం॥ల లోపల వాడని తెలియుచున్నది.

## పల్లవి గోపాలయ్య

ఈయన ద్రావిడ విప్రులలో నౌత్తరుడు. తంజాపురమునందు నివసించుచుండేవారు. సంగీతమందలి మిక్కిలి చతురుడు. గానములో పాండిత్యము మిక్కిలి ప్రగల్భముగా పల్లవులు పాడటం వలన పల్లవి గోపాలయ్య అనే పేరు వచ్చింది. గాన కల్పనాచమత్కృతులు విచిత్రంగా ఉంటుంది. వీరి స్వరకల్పనలు, గమకములన్నిటికంటె అటతాళంలో వీరు రచించిన "వనజాక్షి" అను కళ్యాణి తాన వర్ణమందు ప్రసిద్ధి కలదు.

శ్రీరామభక్తులు, 'వేంకట' అను ముద్రతో కాంభోజి, తోడిరాగములలో అటతాళమందు తానవర్ణాలు, రసప్రధానమైన కీర్తనలు ఎన్నో రచించెను. ఎనిమిదిగంటలపాటు సావేరి రాగమును వీరు పాడినట్లు ఎవరూ పాడలేరని చెప్పుదురు. త్యాగరాజయ్యగారి శిష్యుడగు సుబ్బయ్యర్ కుమారులు. అనేక కృతులు, వర్ణాలు, తిల్లానాలు తమ స్వంతముద్రతో రచించారు.

## తోడిశీతారామయ్య

తోడిరాగము ఈయన స్వంతము. యితరులు వీరి తోడి రాగపు పాటను తాకట్టుగా పెట్టుకొని డబ్బు యిచ్చుచుందురు. వీరి ప్రభువు శరభోజి మహారాజు. తోడిరాగములోని పాటలను పాడి వినిపించుటకు ఆహ్వానిస్తూ ఉండేవారట. సాహిత్యములు, గేయకల్పనలు రచించిరి.

## శంకరాభరణం నరసయ్య

బ్రాహ్మణులు. శంకరాభరణం వీరి స్వంత సొమ్మట. ద్రావిడభాషలో పదములు రచించిరి. వీరు కూడా శరభోజి మహారాజుకాలము వారని చెప్పుచుందురు.

## చినస్వామి దీక్షితులు

ముత్తుస్వామి దీక్షితులవారి అనుజుడు. సంస్కృత ఆంధ్రభాషలయందు నేర్పరి. వైణికాగ్రేసరుడు, మణలి చిన్నయా మొదలియారిసభయందు, యితర రాజసభలయందు సత్కారము పొందిన ఘనుడు. ఒకనాడు తిరువారిలో రసికాగ్రగణ్యులగు ప్రభువులు, పండితులు మొదలైనవారు సభనలంకరించినపుడు ఒకరాత్రి "నాగవరాళి" అను రాగము ఆలపిస్తుండగా యింటిపైకప్పు నుండి సర్పము కిందపడి పడగనెత్తి నాట్యమాడనారంభించిన సమయములో అందరూ భయభ్రాంతులవగా దీక్షితులు భయపడవద్దు, వీణ వాయింపుడని ప్రోత్సహింపగా ఆ పాము రాను రాను క్రిందికి వంగి భూమిలో మాయమయ్యెను. యీ విషయమును కనులారా చూసినవారు ఈయన గురించి చెప్పుకునేవారు. దీక్షితులవారు నారదమహర్షిపై "గానలోన కరుణాలవాల" తోడిరాగం, "నారాయణానంత" అని కళ్యాణరాగమున రెండు కీర్తనలు రచించిరి. 45వ సం॥న వారి సోదరులతో మధురకువచ్చి పరమపదించినట్లు చెప్పుచుందురు.







## రాగస్వరావళి వరుసలు

### 1. మాయామాళవగౌళ-ఆదితాళము- 8 అక్షరములు

**సరళీస్వరాలు :-** సరళం అంటే సులభం, సరళీస్వరాలు అంటే చాలా సులభంగా ఉండే రచనలు. వీటితోనే విద్యార్థులకు సంగీతం నేర్పడం మొదలు పెడతారు. ఇవి నేర్పడం వల్ల స్వరస్థానాలు పలకడం, తాళం వేయడం కొంచెం కొంచెం అలవాటు అవుతుంది. ఇవి కేవలం స్వరాలే పాడతారు. అంటే ఈ స్వరాలకి బదులుగా పాడటానికి ఎలాంటి అక్షరాలు ఉండవు. ఈ అక్షరాలనే సాహిత్యం అంటారు. సరళీస్వరాలకు సాహిత్యం ఉండదన్నమాట.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | సరిగమ | - | పధనిస | - | సనిదప | - | మగరిస ॥ |
| 2. | సరిగమ | - | సరిగమ | - | సరిగమ | - | పదనిస |
| | సనిధప | - | సనిధప | - | సనిధప | - | మగరిస॥ |
| 3. | సరిగమ | - | సరిసరి | - | సరిగమ | - | పధనిస |
| | సనిధప | - | సనిసని | - | సనిధప | - | మగరిస॥ |
| 4. | సరిగమ | - | పాసరి | - | సరిగమ | - | పధనిస |
| | సనిధప | - | మాసని | - | సనిధప | - | మగరిస॥ |
| 5. | సరిగమ | - | పమగరి | - | సరిగమ | - | పధనిస |
| | సనిధప | - | మపధని | - | సనిధప | - | మగరిస॥ |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 6. | సరిగమ | - | పమధప | - | సరిగమ | - | పధనిసీ |
| | సీనిధప | - | మపగమ | - | సీనిధప | - | మగరిస॥ |
| 7. | సరిగమ | - | సమగరి | - | సరిగమ | - | పధనిస |
| | సీనిధప | - | సపధని | - | సీనిధప | - | మగరిస॥ |
| 8. | సరిగమ | - | పాగమ | - | పా॥ | - | పా॥ |
| | గమపధ | - | నిధపమ | - | గమపగ | - | మగరిస॥ |
| 9. | సానిధ | - | నీధప | - | ధాపమ | - | పాపా |
| | గమపధ | - | నిధపమ | - | గమపగ | - | మగరిస॥ |
| 10. | సరిగమ | - | పధనిసీ | - | రి సా | - | నిధనిసీ |
| | నీ నీ | - | ధపధని | - | దా ధా | - | పమపధ |
| | పా పా | - | మగమప | - | మా మా | - | సరిగమ |
| | సీనిధప | - | మగరిస | - | సీనిధప | - | మగరిస ॥ |







## 2. మోహన రాగము - ఆది తాళం

| | | | | | |
|---|---|---|---|---|---|
| స | రి | గ | ప | ధ | సీ |
| ॥ | చ | అం | ॥ | చ | ॥ |

| |
|---|
| సీ ధ ప గ రి స |
| అవరోహణము |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | సారిగ | - | పధసా | - | సాధప | - | గరిసా ॥ |
| 2. | సరిగప | - | గపధస | - | సధపగ | - | పగరిస ॥ |
| 3. | సారిగ | - | రీగప | - | గాపధ | - | పాధసీ |
| | సాధప | - | ధాపగ | - | పాగరి | - | గారిస ॥ |
| 4. | ససరిగ | - | పాపగ | - | ధధపా | - | గగపా |
| | పధసా | - | సదధప | - | సదధప | - | పగరిస॥ |
| 5. | సరిగరి | - | గపగప | - | గపధస | - | సా సా |
| | రిసధప | - | సధపగ | - | ధపగరి | - | పగరిస॥ |
| 6. | సరిగప | - | ధపగరి | - | సరిగప | - | గపదస |
| | సధపగ | - | రిగపధ | - | సధపగ | - | పగరిస॥ |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 7. | సరిగరి | - | గపధప | - | సరిగప | - | గపధస | |
| | సధపధ | - | పగరిగ | - | సధపగ | - | పగరిస ॥ | |
| 8. | సరిగరి | - | గారిగ | - | పా॥ | - | పా॥ | |
| | గపధప | - | ధసధప | - | గపధప | - | గగరిస॥ | |
| 9. | సరిగరి | - | గపగరి | - | సరిగప | - | గపధస | |
| | సధపధ | - | పగపధ | - | సధపగ | - | పగరిస॥ | |
| 10. | సరిగరి | - | గారిగ | - | పగపా | - | ధపధా | |
| | గపధప | - | ధసధప | - | గపధప | - | గగరిస ॥ | |

## 3. తోడి రాగము- ఆదితాళము

| స | రి | గ | మ | ధ | ని | స |
|---|---|---|---|---|---|---|
| ॥ | శు | సా | శు | శు | కై | ॥ |

| స ని ధ మ గ రి స |
|---|
| అవరోహణము |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | సరిగమ | - | ధనిసా | - | సనిధమ | - | గరిసా ॥ |
| 2. | సరిగమ | - | గమగమ | - | గమధమ | - | ధనిసా |
| | సనిధమ | - | నిధమగ | - | ధమగరి | - | మగరిస ॥ |







| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 3. | సరిగమ | - | ధమగరి | - | సరిగమ | - | ధనిసా |
| | సనిధమ | - | గమధని | - | సనిధమ | - | గరిసా ॥ |
| 4. | సరిగమ | - | రిగమధ | - | గమధని | - | మధనిస |
| | సనిధమ | - | నిధమగ | - | ధమగరి | - | మగరిస ॥ |
| 5. | సరిగమ | - | మనిధమ | - | సరిగమ | - | ధనిసా |
| | సనిధమ | - | గరిగమ | - | సనిధమ | - | గరిసా ॥ |
| 6. | సరిగమ | - | ధమగమ | - | సరిగమ | - | ధనిసా |
| | సనిధమ | - | గమధమ | - | సనిధమ | - | గరిసా ॥ |
| 7. | సరిగమ | - | ధాగమ | - | ధా ॥ | - | ధా ॥ |
| | గమధని | - | సనిధమ | - | గమగరి | - | గరిసా ॥ |
| 8. | సరిగరి | - | రిగమగ | - | గమధమ | - | ధనిసా |
| | సనిధని | - | నిధమధ | - | ధమగమ | - | గరిసా ॥ |
| 9. | సరిగమ | - | ధమనిధ | - | సరిగమ | - | ధనిసా |
| | సనిధమ | - | గమరిగ | - | సనిధమ | - | గరిసా ॥ |
| 10. | సరిగమ | - | ధనిసా | - | రిససని | - | నిదధమ |
| | నిదధమ | - | మగమ | - | నిధమగ | - | మగరిస ॥ |

## 4. ధీరశంకరాభరణము- ఆది తాళము

| స | రి | గ | మ | ప | ధ | ని | స |
|---|---|---|---|---|---|---|---|
| ॥ | చ | అం | శు | ॥ | చ | కా | ॥ |

| స ని ధ ప మ గ రి స |
|---|
| అవరోహణము |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | సరిగమ | - | పధనిస | - | సా॥ | - | సా॥ |
| | ధనిసరి | - | సనిధప | - | సనిధప | - | మగరిస॥ |
| 2. | సరిగమ | - | పధనిస | - | సా ॥ | - | సా ॥ |
| | ధనిసరి | - | ససరిస | - | సరిసని | - | ధపమప |
| | ధనిసరి | - | సనిధప | - | సనిధప | - | మగరిస ॥ |
| 3. | సరిగమ | - | పధనిస | - | సా॥ | - | సా ॥ |
| | ధనిసరి | - | గరిసని | - | సరిసని | - | ధపమప |
| | ధనిసరి | - | ససరిస | - | సరిసని | - | ధపమప |
| | ధనిసరి | - | సనిధప | - | సనిధప | - | మగరిస ॥ |
| 4. | సరిగమ | - | పధనిస | - | సా ॥ | - | సా ॥ |
| | ధనిసరి | - | గమగరి | - | సరిసని | - | ధపమప |







| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ధనిసరి | - | గరిసరి | - | సరిసని | - | ధపమప |
| | ధనిసరి | - | ససరిస | - | సరిసని | - | ధపమప |
| | ధనిసరి | - | సనిధప | - | సనిధప | - | మగరిస॥ |
| 5. | సరిగమ | - | పధనిస | - | సా ॥ | - | సా॥ |
| | ధనిసరి | - | గమపమ | - | గమగరి | - | సనిధప |
| | ధనిసరి | - | గమగరి | - | సరిసని | - | ధపమప |
| | ధనిసరి | - | గరిసరి | - | సరిసని | - | ధపమప |
| | ధనిసరి | - | ససరిస | - | సరిసని | - | ధపమప |
| | ధనిసరి | - | సనిధప | - | సనిధప | - | మగరిస ॥ |
| 6. | సరిగమ | - | పధనిస | - | సా ॥ | - | సా॥ |
| | సరిగరిరిస | - | నిసరిసని | - | ధనిసని నిధ- | | |
| | పధనిదధప | - | మపధపపమ | - | గమపమమగ | | |
| | మపధని | - | సనిధపమ | - | మగరిస ॥ | | |

| | | | | |
|---|---|---|---|---|
| 7. | సరిగమ - | పధనిస - | సా ॥ - | సా॥ |
| | గరిరిససని - | రిససనిధని - | సనినిధధప | |
| | నిదధపపమ - | ధపపమమగ - | మపగమపధ | |
| | సనిధప - | సనిధప - | మగరిస ॥ | |
| 8. | సరిగమ - | పధనిస - | సా॥ - | సా॥ |
| | సస్సరిసని - | నిన్నిసనిధ - | ద ద్ధనిధప | |
| | పప్పధపమ - | మమ్మపమగ - | మపగమపధ | |
| | సనిధప - | సనిధప - | మగరిస ॥ | |
| 9. | సరిగమ - | పధనిస - | సా॥ - | సా॥ |
| | సరిగారిస - | నిసరిసని - | ధనిసానిధ | |
| | పధనీధప - | మపధాపమ - | గమపామగ | |
| | మపధని - | సనిధప - | మగరిస ॥ | |







| | | | | |
|---|---|---|---|---|
| 10. | సరిగమ - | పధనిస - | సా॥- | సా॥ |
| | సారిగరిస - | నీసరిసని - | ధానిసనిద - | |
| | పాధనిధప - | మాపధపమ - | గామపమగ | |
| | మపధని - | సనిధప - | మగరిస ॥ | |

## 5. మధ్యమావతిరాగము- ఆది

| | | | | | |
|---|---|---|---|---|---|
| స | రి | మ | ప | ని | స |
| ॥ | చ | శు | ॥ | కై | ॥ |

| |
|---|
| స ని ప మ రి స |
| అవరోహణము |

| | | | | |
|---|---|---|---|---|
| 1. | సారిమ - | పనిసా - | సానిప - | మరిసా ॥ |
| 2. | సరిమప - | మపనిస - | సనిపమ - | పమరిస ॥ |
| 3. | సరిమస - | నిపనిస - | సనిపమ - | రిమరిస ॥ |
| 4. | సరిమరి - | మపనిప - | సనిపని - | పమరిస ॥ |
| 5. | సరిమా - | పమనిప - | సరిమప - | మపనిస |
| | సనిపా - | మపరిమ - | సనిపమ - | పమరిస ॥ |

| | | | | |
|---|---|---|---|---|
| 6. | సరిమరిమా - | మపనిపనీ - | స̇నిస̇ా - | |
| | పనిస̇ని - | స̇రి̇స̇ని - | పనిస̇ని - | పమరిస ॥ |
| 7. | సరిమప - | నిపమరి - | సరిమప - | నిపనిస̇ |
| | స̇నిపమ - | రిమపని - | స̇నిపమ - | రిమరిస ॥ |
| 8. | సరిమరి - | రిమపమ - | మపనిప - | నినిస̇ా |
| | పనిపని - | నిపమప - | పమరిమ - | రిరిస̇ా ॥ |
| 9. | సారిమ - | పమరిస - | సరిమప - | నినిస̇ా |
| | స̇ానిప - | మపనిస̇ - | స̇నిపమ - | రిరిసా ॥ |
| 10. | సరిమప - | రిమపని - | మపనిస̇ - | స̇ా స̇ా |
| | స̇రి̇మ̇రి̇స̇ని - | పనిస̇నిపమ - | రిమరిస ॥ | |







## జంట వరుసలు

జంట స్వరాలు :- జంట అంటే రెండు. జంట స్వరాలు అంటే రెండు స్వరాలు. ఒకే స్వరాన్ని రెండుసార్లు పాడతారు. ఇవి కూడా కేవలం స్వరాలే. వీటికి కూడా సాహిత్యం ఉండదు. కేవలం స్వరాలనే పాడతారు.

### 1. మాయామాళవగౌళ- ఆదితాళము

| స | రి | గ | మ | ప | ధ | ని | స̇ |
|---|---|---|---|---|---|---|---|
| ॥ | శు | అం | శు | ॥ | శు | కా | ॥ |

| స̇ ని ధ ప మ గ రి స |
|---|
| అవరోహణము |

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ససరిరి - | గగమమ - | పపదధ - | నినిస̇స̇ |
| | స̇స̇నిని - | దధపప - | మమగగ - | రిరిసస ॥ |
| 2. | ససరిరి - | గగమమ - | రిరిగగ - | మమపప |
| | గగమమ - | పపదధ - | మమపప - | దధనిని |
| | పపదధ - | నినిస̇స̇ - | స̇స̇నిని - | దధపప |
| | నినిదధ - | పపమమ - | దధప̇ప - | మమగగ |
| | పపమమ - | గగరిరి - | మమగగ - | రిరిసస ॥ |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 3. | ససరిరి | - | గగరిరి | - | ససరిరి | - | గగమమ |
| | రిరిగగ | - | మమగగ | - | రిరిగగ | - | మమపప |
| | గగమమ | - | పపమమ | - | గగమమ | - | పపదధ |
| | మమపప | - | దధపప | - | మమపప | - | దధనిని |
| | పపదధ | - | నినిదధ | - | పపదధ | - | నినిసస |
| | ససనిని | - | దధనిని | - | ససనిని | - | దధపప |
| | నినిదధ | - | పపదధ | - | నినిదధ | - | పపమమ |
| | దధపప | - | మమపప | - | దధపప | - | మమగగ |
| | పపమమ | - | గగమమ | - | పపమమ | - | గగరిరి |
| | మమగగ | - | రిరిగగ | - | మమగగ | - | రిరిసస ॥ |
| 4. | సరిరిగ | - | సరిరిగ | - | ససరిరి | - | గగమమ |
| | రిగగమ | - | రిగగమ | - | రిరిగగ | - | మమపప |
| | గమమప | - | గమమప | - | గగమమ | - | పపదధ |
| | మపపధ | - | మపపధ | - | మమపప | - | దధనిని |







| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పదధని | - | పదధని | - | పపదధ | - | నినిసస |
| సనినిధ | - | సనినిధ | - | ససనిని | - | దధపప |
| నిదధప | - | నిదధప | - | నినిదధ | - | పపమమ |
| ధపపమ | - | ధపపమ | - | దధపప | - | మమగగ |
| పమమగ | - | పమమగ | - | పపమమ | - | గగరిరి |
| మగగరి | - | మగగరి | - | మమగగ | - | రిరిసస॥ |

## 2. మోహనరాగము- ఆది తాళము

| స | రి | గ | ప | ధ | స |
|---|---|---|---|---|---|
| ॥ | చ | అం | ॥ | చ | ॥ |

| స ధ ప గ రి స |
|---|
| అవరోహణము |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ససరిరిగ | - | సరిగ | - | ససరిరి | - | గగపప |
| | రిరిగగప | - | రిగప | - | రిరిగగ | - | పపదధ |
| | గగపపధ | - | గపధ | - | గగపప | - | దధసస |
| | ససదధప | - | సదప | - | ససదధ | - | పపగగ |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | దధపపగ | - | ధపగ | - | దధపప | - | గగరిరి |
| | పపగగరి | - | పగరి | - | పపగగ | - | రిరిసస |
| 2. | సాస | - | రీరిగగ | - | ససరిరి | - | గగపప |
| | రీరి | - | గాగపప | - | రిరిగగ | - | పపదధ |
| | గాగ | - | పాపదధ | - | గగపప | - | దధసస |
| | సాస | - | దాధపప | - | ససదధ | - | పపగగ |
| | దాధ | - | పాపగగ | - | దధపప | - | గగరిరి |
| | పాప | - | గాగరిరి | - | పపగగ | - | రిరిసస ॥ |
| 3. | ససరి | - | సారిసరి | - | ససరిరి | - | గగపప |
| | రిరిగ | - | రీగరిగ | - | రిరిగగ | - | పపదధ |
| | గగప | - | గాపగప | - | గగపప | - | దధసస |
| | ససధ | - | సాధసధ | - | ససదధ | - | పపగగ |
| | దధప | - | ధాపధప | - | దధపప | - | గగరిరి |
| | పపగ | - | పాగపగ | - | పపగగ | - | రిరిసస ॥ |







| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 4. | ససా | - | రీగసరి | - | ససరిరి | - | గగపప |
| | రిరీ | - | గాపరిగ | - | రిరిగగ | - | పపదధ |
| | గగా | - | పాధగప | - | గగపప | - | దధసస |
| | ససా | - | ధాపసధ | - | ససదధ | - | పపగగ |
| | దధా | - | పాగధప | - | దధపప | - | గగరిరి |
| | పపా | - | గారిపగ | - | పపగగ | - | రిరిసస ॥ |

## 3. తోడి రాగము- ఆది తాళము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ధ | ని | స |
| ॥ | శు | సా | శు | శు | కై | ॥ |

| |
|---|
| స ని ధ మ గ రి స |
| అవరోహణము |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ససరి | - | ససరిసరి | - | ససరిరి | - | గగమమ |
| | రిరిగ | - | రిరిగరిగ | - | రిరిగగ | - | మమదధ |
| | గగమ | - | గగమగమ | - | గగమమ | - | దధనిని |
| | మమధ | - | మమధమధ | - | మమదధ | - | నినిసస |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | ససని | - | ససనిసని | - | ససనిని | - | దధమమ |
| | నినిధ | - | నినిధనిధ | - | నినిదధ | - | మమగగ |
| | దధమ | - | దధమధమ | - | దధమమ | - | గగరిరి |
| | మమగ | - | మమగమగ | - | మమగగ | - | రిరిసస ॥ |
| 2. | ససస | - | రిరిరిగ | - | ససరిరి | - | గగమమ |
| | రిరిరి | - | గగగమమ | - | రిరిగగ | - | మమదధ |
| | గగగ | - | మమమదధ | - | గగమమ | - | దధనిని |
| | మమమ | - | దధధనిని | - | మమదధ | - | నినిసస |
| | ససస | - | నినినిదధ | - | ససనిని | - | దధమమ |
| | నినిని | - | దధధమమ | - | నినిదద | - | మమగగ |
| | దధధ | - | మమమగగ | - | దధమమ | - | గగరిరి |
| | మమమ | - | గగగరిరి | - | మమగగ | - | రిరిసస ॥ |
| 3. | ససరిగా | - | సరిగ | - | ససరిరి | - | గగమమ |
| | రిరిగమా | - | రిగమ | - | రిరిగగ | - | మమదధ |







| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | గగమధా | - | గమధ | - | గగమమ | - | ధధనిని |
| | మమధనీ | - | మధని | - | మమదధ | - | నినిసస |
| | ససనిధా | - | సనిధా | - | ససనిని | - | దధమమ |
| | నినిధమా | - | నిధమ | - | నినిదధ | - | మమగగ |
| | దధమగా | - | ధమగ | - | దధమమ | - | గగరిరి |
| | మమగరీ | - | మగరి | - | మమగగ | - | రిరిసస ॥ |
| 4. | ససారి | - | సారిగ | - | ససరిరి | - | గగమమ |
| | రిరీగ | - | రీగమ | - | రిరిగగ | - | మమదధ |
| | గగామ | - | గామధ | - | గగమమ | - | దధనిని |
| | మమాధ | - | మాధని | - | మమదధ | - | నినిసస |
| | ససాని | - | సానిధ | - | ససనిని | - | దధమమ |
| | నినీధ | - | నీధమ | - | నినిదధ | - | మమగగ |
| | దధామ | - | ధామగ | - | దధమమ | - | గగరిరి |
| | మమాగ | - | మాగరి | - | మమగగ | - | రిరిసస ॥ |

## 4. ధీరశంకరాభరణము- ఆదితాళము

| స | రి | గ | మ | ప | ధ | ని | స̇ |
|---|---|---|---|---|---|---|---|
| ॥ | చ | అం | శు | ॥ | చ | కా | ॥ |

స̇ ని ధ ప మ గ రి స
అవరోహణము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ససరిరి | - | గాసరి | - | ససరిరి | - | గగమమ |
| | రిరిగగ | - | మారిక | - | రిరిగగ | - | మమపప |
| | గగమమ | - | పాగమ | - | గగమమ | - | పపదధ |
| | మమపప | - | ధామప | - | మమపప | - | దధనిని |
| | పపదధ | - | నీపధ | - | పపదధ | - | నినిస̇స̇ |
| | ససనిని | - | ధాసని | - | స̇స̇నిని | - | దధపప |
| | నినిదధ | - | పానిధ | - | నినిదధ | - | పపమమ |
| | దధపప | - | మాధప | - | దధపప | - | మమగగ |
| | పపమమ | - | గాపమ | - | పపమమ | - | గగరిరి |
| | మమగగ | - | రీమగ | - | మమగగ | - | రిరిసస |







| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 2. | ససరిగ | - | సరిగరి | - | ససరిరి | - | గగమమ |
| | రిరిగమ | - | రిగమగ | - | రిరిగగ | - | మమపప |
| | గగమప | - | గమపమ | - | గగమమ | - | పపదధ |
| | మమపధ | - | మపధప | - | మమపప | - | దధనిని |
| | పపధని | - | పధనిధ | - | పపదధ | - | నినిస̇స̇ |
| | స̇స̇నిధ | - | స̇నిధని | - | స̇స̇నిని | - | దధపప |
| | నినిధప | - | నిధపధ | - | నినిదధ | - | పపమమ |
| | దధపమ | - | ధపమప | - | దధపప | - | మమగగ |
| | పపమగ | - | పమగమ | - | పపమమ | - | గగరిరి |
| | మమగరి | - | మగరిగ | - | మమగగ | - | రిరిసస |
| 3. | సరిగా | - | సారిగ | - | ససరిరి | - | గగమామ |
| | రిగమా | - | రీగమ | - | రిరిగగ | - | మమపప |
| | గమపా | - | గామప | - | గగమమ | - | పపదధ |
| | మపధా | - | మాపధ | - | మమపప | - | దధనిని |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | పదనీ | - | పాధనీ | - | పపదధ | - | నినిస̇స̇ |
| | స̇నిధా | - | సా̇నిధ | - | స̇స̇నిని | - | దధపప |
| | నిదపా | - | నీదప | - | నినిదధ | - | పపమమ |
| | ధపమా | - | ధాపమ | - | ధధపప | - | మమగగ |
| | పమగా | - | పామగ | - | పపమమ | - | గగరిరి |
| | మగరీ | - | మాగరి | - | మమగగ | - | రిరిసస |
| 4. | ససస | - | రిరిరి | - | గగగ | - | మమమ |
| | రిరిరి | - | గగగ | - | మమమ | - | పపప |
| | గగగ | - | మమమ | - | పపప | - | దదధ |
| | మమమ | - | పపప | - | దదధ | - | నినిని |
| | పపప | - | దదధ | - | నినిని | - | స̇స̇స̇ |
| | స̇స̇స̇ | - | నినిని | - | దదధ | - | పపప |
| | నినిని | - | దదధ | - | పపప | - | మమమ |
| | దదధ | - | పపప | - | మమమ | - | గగగ |
| | పపప | - | మమమ | - | గగగ | - | రిరిరి |
| | మమమ | - | గగగ | - | రిరిరి | - | ససస |







## 5. మధ్యమావతి- ఆదితాళము

| | | | | | |
|---|---|---|---|---|---|
| స | రి | మ | ప | ని | స̇ |
| ॥ | చ | శు | ॥ | కై | ॥ |

| |
|---|
| స̇ ని ప మ రి స |
| అవరోహణము |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ససరిరి | - | ససరిరి | - | ససరిరి | - | మమపప |
| | రిరిమమ | - | రిరిమమ | - | రిరిమమ | - | పపనిని |
| | మమపప | - | మమపప | - | మమపప | - | నినిస̇స̇ |
| | స̇స̇నిని | - | ససనిని | - | స̇స̇నిని | - | పపమమ |
| | నినిపప | - | నినిపప | - | నినిపప | - | మమరిరి |
| | పపమమ | - | పపమమ | - | పపమమ | - | రిరిసస |
| 2. | ససరిరి | - | సరిసరి | - | ససరిరి | - | మమపప |
| | రిరిమమ | - | రిమరిమ | - | రిరిమమ | - | పపనిని |
| | మమపప | - | మపమప | - | మమపప | - | నినిసస |
| | ససనిని | - | సనిసని | - | ససనిని | - | పపమమ |

| | | | | |
|---|---|---|---|---|
| | నినిపప - | నిపనిప - | నినిపప - | మమరిరి |
| | పపమమ - | పమపమ - | పపమమ - | రిరిసస |
| 3. | సారిస - | సారిస - | ససరిరి - | మమపప |
| | రీమరి - | రీమరి - | రిరిమమ - | పపనిని |
| | మాపమ - | మాపమ - | మమపప - | నినిసంసం |
| | సానిస - | సానిస - | సంసంనిని - | పపమమ |
| | నీపని - | నీపని - | నినిపప - | మమరిరి |
| | పామప - | పామప - | పపమమ - | రిరిసంసం |
| 4. | సరీ - | రిమారిస - | ససరిరి - | మమపప |
| | రిమా - | మపామరి - | రిరిమమ - | పపనిని |
| | మపా - | పనీపమ - | మమపప - | నినిసంసం |
| | సనీ - | నిపానిస - | సంసంనిని - | పపమమ |
| | నిపా - | పమాపని - | నినిపప - | మమరిరి |
| | పమా - | మరీమప - | పపమమ - | రిరిసస |







# అలంకారములు

అలంకారాలు :- సరళీలు, జంటలు నేర్చుకొన్నాక విద్యార్థులు అలంకారాలు నేర్చుకుంటారు. ఇవి కూడా మాయామాళవగౌళ రాగంలోనే ఉంటాయి. ఇవి నేర్చుకోవడం వల్ల రకరకాల తాళాలు విద్యార్థులకు అర్థం అవుతాయి. సప్తతాళాలలోను అలంకారాలు నేర్పడం వల్ల తాళం ఎలా వెయ్యాలో అర్థం అవుతుంది. దీనికి కూడా సాహిత్యం ఉండదు. కేవలం స్వరాలే పాడతారు.

## 1. మాయామాళవగౌళ రాగము

| స | రి | గ | మ | ప | ధ | ని | సం |
|---|---|---|---|---|---|---|---|
| ॥ | శ | అం | శు | ॥ | శు | కా | ॥ |

| స ని ధ ప మ గ రి స |
|---|
| అవరోహణము |

## చతురశ్రజాతి- ధృవతాళము

| | 1 | ○ | 1 | 1 |
|---|---|---|---|---|
| 1. | సరిగమ - | గరి - | సరిగరి - | సరిగమ |
| | రిగమప - | మగ - | రిగమగ - | రిగమప |
| | గమపధ - | పమ - | గమపమ - | గమపధ |
| | మపధని - | ధప - | మపధప - | మపధని |
| | పధనిసం - | నిధ - | పధనిధ - | పధనిసం |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | స̇నిధప | - | ధని | - | స̇నిధని | - | స̇నిధప |
| | నిధపమ | - | పధ | - | నిధపధ | - | నిధపమ |
| | ధపమగ | - | మప | - | ధపమప | - | ధపమగ |
| | పమగరి | - | గమ | - | పమగమ | - | పమగరి |
| | మగరిస | - | రిగ | - | మగరిగ | - | మగరిస ॥ |

**తిశ్రజాతి- ధ్రువతాళము**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 2. | సరిగ | - | రిస | - | సరిగ | - | రిగమ |
| | రిగమ | - | గరి | - | రిగమ | - | గమప |
| | గమప | - | మగ | - | గమప | - | మపధ |
| | మపధ | - | పమ | - | మపధ | - | పధని |
| | పధని | - | ధప | - | పధని | - | ధనిస̇ |
| | స̇నిధ | - | నిస̇ | - | స̇నిధ | - | నిధప |
| | నిధప | - | ధని | - | నిధప | - | ధపమ |







| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ధపమ | - | పధ | - | ధపమ | - | పమగ |
| పమగ | - | మప | - | పమగ | - | మగరి |
| మగరి | - | గమ | - | మగరి | - | గరిస |

**3. మిశ్రజాతి- ధ్రువతాళము**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సరిగమపధని | - | ధప | - | సరిగమపధప | - | సరిగమపధని |
| రిగమపధనిస̇ | - | నిధ | - | రిగమపధనిధ | - | రిగమపధనిస̇ |
| స̇నిధపమగరి | - | గమ | - | స̇నిధపమగమ | - | స̇నిధపమగరి |
| నిధపమగరిస | - | రిగ | - | నిధపమగరిగ | - | నిధపమగరిస |

**4. ఖండజాతి- ధ్రువతాళము**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సరిగమప | - | మగ | - | సరిగమగ | - | సరిగమప |
| రిగమపధ | - | పమ | - | రిగమపమ | - | రిగమపధ |
| గమపధని | - | ధప | - | గమపధప | - | గమపధని |
| మపధనిస̇ | - | నిధ | - | మపధనిధ | - | మపధనిస̇ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సనిధపప | - | పధ | - | సనిధపధ | - | సనిధపమ |
| నిధపమగ | - | మప | - | నిధపమప | - | నిధపమగ |
| ధపమగరి | - | గమ | - | ధపమగమ | - | ధపమగరి |
| పమగరిస | - | రిగ | - | పమగరిగ | - | పమగరిస |

## 5. సంకీర్ణజాతి-ధ్రువతాళము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సారీగమపధని | - | ధప | - | సారీగమపధప | - | సారీగమపధని |
| రీగామపధనిస | - | నిధ | - | రీగామపధనిధ | - | రీగామపధనిస |
| సానీధపమగరి | - | గమ | - | సానీధపమగమ | - | సానీధపమగరి |
| నీధాపమగరిస | - | రిగ | - | నీధాపమగరిగ | - | నీధాపమగరిస |

## II. హనుమతోడిరాగము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ధ | ని | స |
| ॥ | శు | సా | శు | ॥ | శు | కై | ॥ |

| |
|---|
| స ని ధ ప మ గ రి స |
| అవరోహణము |







## చతురశ్రజాతి- మఠ్యతాళము

| | | | | |
|---|---|---|---|---|
| సరిగరి | - | సరి | - | సరిగమ |
| రిగమగ | - | రిగ | - | రిగమప |
| గమపమ | - | గమ | - | గమపధ |
| మపధప | - | మప | - | మపధని |
| పధనిధ | - | పధ | - | పధనిస |
| సనిధని | - | సని | - | సనిధప |
| నిధపధ | - | నిధ | - | నిధపమ |
| ధపమప | - | ధప | - | ధపమగ |
| పమగమ | - | పమ | - | పమగరి |
| మగరిగ | - | మగ | - | మగరిగ |

## తిశ్రజాతి- మఠ్యతాళము

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2. | సరిగ | - | సరి | - | సరిగ |
| | రిగమ | - | రిగ | - | రిగమ |

